శ్రీ

# రామకుమారాభ్యుదయము

(నాటకము)

గ్రంథకర్త:
గాల్లదిన్నె సుబ్బరా...



ప్రధానపోషకులు:
మ॥ రా॥ బదినేహాళు తిమ్మారెడ్డిగారు,
ఆదవాని.

వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.
బెజవాడ.

రక్తాక్షి సంవత్సర కార్తీకశుద్ధ పూర్ణిమ.

1924.



వెల రు 1-0-0.

# ఇందువచ్చు పాత్రలు.

(పురుషులు.)

శ్రీరాముఁడు—అయోధ్యా నగరము రాజు

భరతుఁడు—
లక్ష్మణుఁడు—
శత్రుఘ్నుఁడు—
} శ్రీరాముని తమ్ములు.

సుమంత్రుఁడు—ప్రధానుఁడు.

వశిష్ఠుఁడు—ఋషి, శ్రీరాముని పౌరోహితుఁడు.

వాల్మీకి—ఋషి, కుశలవుల గురువు.

జనకుఁడు—శ్రీరామునిమామ.

విభీషణుఁడు—
సుగ్రీవుఁడు—
ఆంజనేయుఁడు—
జాంబవంతుఁడు—
అంగదుఁడు—
వానరులు—
} శ్రీరాముని పరివారజనము.

కుశుఁడు—
లవుఁడు—
} శ్రీరాముని కుమారులు,

శ్రీవత్సుఁడు—
హృషీకేశుఁడు—
మృత్యుంజయుఁడు—
} మునికుమారులు

శంభుభట్టు—త్రివిక్రమాచార్యులు,
నరసింహాచార్యులు,
} బ్రాహ్మణులు

ఋషులు.

భద్రుఁడు—శ్రీరాముని ముఖ్య సేవకుఁడు.

పౌరులు.

(స్త్రీలు.)

సీత—శ్రీరామునిభార్య

అపర్ణ—
చారురూప—
భార్గవి—
} మునిపత్నులు.

ఇందిర—సీత చెలికత్తె

శ్రీరామాయనమః॥

# విజ్ఞప్తి

ఆంధ్రభాషా విశారదులారా! పాఠకమహాశయులారా! శ్రీగుర్వనుగ్రహమువలనను, భగవత్కృపచేతను, పెద్దలసేవంబట్టియు నాకు నాలుగు తెలుఁగుమాటలల్లుట వచ్చుటచేతఁ దొలుత నొక కృష్ణశతకమును రచించి శ్రీకృష్ణున కప్పగించితి.

పదపడి దేనినైన నొక గ్రంథమును వ్రాయవలెనని కుతూహలము మదిమదిం గలిగియుండి ప్రథమప్రయత్నమగుటచే భగవత్కథనే రచింపవలెనని తోఁచి యందులకుఁ దన్మహనీయుని యపారకథాసముద్రములోనే తరంగముం గొందునని యోజించుచుండ భవసాగర సముత్తారక నాముఁడగు శ్రీరాముని చరిత్రమునందలి యుత్తరకాండాంతర్గతమై రుచిమంతమగు నశ్వమేధకథయుఁ గుశలవజననమును గల భాగము నాకుఁదోఁచె. దీనిని నాటకముగా వ్రాయఁదలంపు పుట్టె; యెందులకన నాటకములయెడ నాకుఁగల యాదరమట్లు ప్రేరేపించినది. వెంటనే యంతకుమున్ను రచింపఁబడిన కుశలవ నాటకములు నాకు స్ఫురించె. సంకల్పిత కార్యమునకుఁ గారణము సమకూరెనని సంతసించితి. ఎట్లన నిప్పుడు వెలువడిన నాటకములలో సీతయెడ నపనింద సంభవించినపుడు శ్రీరాముఁడామెను బరిత్యజించిన పట్టున నతఁడా సాధ్వీశిరోమణియెడ ననుమానము స్థిరీకరించుకొని యతిశయకోపప్రవిష్టుఁడై యామెను విడనాడినట్లు వ్రాయఁబడియున్నది. శ్రీరాముఁడు మనవలె సామాన్యమైన మానిసి కాదు. అనుత్తమరాజేంద్రుఁడు, రాజ

ధర్మైకనిపుణుఁడు, కళ్యాణగుణరత్నాకరుఁడు, సర్వజ్ఞమూర్తి, కావున నాటకాభిరుచికొఱకుఁ గథానాయకుఁడగు నాతని నిరుపమాన గుణౌన్నత్యమును జెడుపక మూలానుసారముగఁ బాత్రపోషణ మొనర్చి వ్రాసినాను. రామకుమారాభ్యుదయమని పేరిడితి. అట్టుల నీనాటకమును భక్తి తాత్పర్యంబులను, మూలానుసారముగను, యథాశక్తిగను రచియించినాను. గనుక కథాసంవిధానచాతుర్యము, రసపుష్టియు మున్నగునవి తమకుఁ జిక్కవని నాతలంపు, వెండియు నిందేవేని గుణములున్న నా పెద్దల యాశీర్వచన మహిమయే కారణమనియు, దోషపుంజమునకు నాయల్పజ్ఞానమే హేతువనియు బుధవర్యులు నమ్మి హంసలుంబోలె గుణపయఃకణంబుల గ్రహించి దోషనీరంబులఁ బరిత్యజింపనగునని ప్రార్థన.

ఇఁక మూలవ్యతిరిక్తమైన నిజసీతాసమేతముగా శ్రీరాముఁడు యజ్ఞమును సంపూర్తిఁ జేసినట్టు" వ్రాయఁబడిన కడపటియంకము మంగళాంతముగా నున్నది, ఇయ్యది, సీతభూగర్భమును జొచ్చుట గైకొనినఁ గథ ముగిపు బాగుండదనియు, నాటకము ఖేదాంతమగుననియు నేనవలంబించిన స్వాతంత్ర్యము, లేక కల్పనము. ఇందులకు నన్ను క్షమింప వేడుచున్నాను.

ఈ గ్రంథమును శ్రీకారము మొదలుకొని తథాస్తువఱకుఁ దమకు శ్రమయని తలంపక యభిమాన పురస్సరముగఁ బరిశీలించి స్ఖాలిత్యముల సవరించి మార్గదర్శకులుగా నుండిన.

బ్ర॥ శ్రీ॥ కావ్యభూషణ, ఆంధ్రవిద్యావాచస్పతి, తొగర్చేటి, సిద్ధాంతి భాస్కరశాస్త్రిలు వారికిని,

మ॥ రా॥ వి. ఏ. కామేశ్వరరావుపంతులు, యం.ఏ., యల్.టి. వారికిని.

మ॥ రా॥ గంటి జోగి సోమయాజులు బి. ఏ., యల్. టి., గారికిని.

బ్ర॥ శ్రీ॥ ప్రయాగ వెంకటరామశాస్త్రులు వారికిని,

,, ,, కావ్యతీర్థ, జనమంచి శేషాద్రిశర్మగారికిని.

నాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఉపక్రమణ కాలమున నమంజ సవిధానమును సూచించిన మిత్రుడగు మ॥ రా॥ ఆర్. చిదంబరరావు, బి. ఏ గారికిని, సమగ్రముగాఁ బరిశోధించిన మిత్రుఁడగు, ఆదిరాజు భీమరావుగారికిని నానమస్కృతుల నొసఁగుచున్నాను.

ఈకృతి కన్యను నాభాగ్యవశమునఁ బుట్టినతోడనే చేపట్టి యలరింపఁజేయ సమకట్టి తత్ప్రకటనభారమంతయు వహించిన యాదవాని పురవాస్తవ్యులును, నాదవాని స్థానిక పరిపాలన సంఘాధ్యక్షులైన మ॥ రా॥ రా॥ బదినేహాళు తమ్మిరెడ్డిగారికి గ్రంథము నంకితమొనర్చుటయేకాక వారి మహౌదార్యమును, భాషాభిమానమును, పండితపక్షపాతమును మిగులఁ గొనియాడుచు వారియెడ ననవరతము కృతజ్ఞుఁడనై యున్నాను,

ఈపొత్తము నుత్తమపత్రములఁ జక్కని యక్కరములతో శీఘ్రకాలమున ముద్రించి యెప్పటియట్లు దప్పులు చొప్పడకుండునట్లు భాషాసంప్రీతమై సంపాదించి వెలువరించిన వాణీప్రెస్సువారి నభినందించుచున్నాను.

ఇట్లు,

ఆదవాని, 1924. — బుధజన విధేయుఁడు, గ్రంథకర్త.

# అంకితము.

గీతమాలిక — వసుధఁగల దేశములయందు వాసికెక్కి
వెలిగెడు భరతఖండమందలి యనేక
మండలంబులఁ దనవాసినిండి, పేరు
గన్న బళ్ళారిజిల్లాకుఁ గలిసి, సిరుల
నమరు పట్టణోత్తమమగు నాదవానిఁ
దల్లిగాఁగల్గి గ్రామరత్నంబనంగ
వన్నెగాంచిన పల్లెయా బదినెహాళు
సంస్తుతింపంగ నెవ్వానిజన్మభూమి ॥

ఆఖ్యమాత్రమెకాక యన్వర్థకముగ
శ్రీలఁదులదూగి శంకరప్రేమఁబడసి
పేరుబొందినయట్టి కుబేరరెడ్డి
వెనుకదీయని యీగిని వేల్పుగడ్డి
వఱలుచుండెను బుడమి నెవ్వానితాత ॥

అతిశయత్యాగి, శంభుపూజానురాగి
సతత హరభక్తియోగి, యాజన్మభోగి
భవ్యగుణశీలి, సమధిక భాగ్యశాలి
బంధుపరిపాలియా, విరూపాక్షరెడ్డి
ప్రస్తుతింపంగనొప్పె నెవ్వానితండ్రి ॥

నయవచోన్వీత, పతిమనోనందవల్లి
దీనజనకల్పవల్లి, సతీమతల్లి

తతదయాపరిపాలితాశ్రితకదంబ
మంగళగుణావలంబయగా, లింగమాంబ
జాళువాతమ్మి మానససరసియట్లు
సన్నుతింపంగ నెవ్వానిఁగన్నతల్లి ॥

అట్టిపుణ్యాత్ములకుఁ గల్గినట్టివాఁడు
ధర్మవేత్తౌడటంచెదఁ దలఁచువాఁడు
నిక్కమే గెలుపనుచు గణించువాఁడు
దీనజనముల పైదోడు, తేగకాడు
నధికసుజ్ఞాని, కవి పండితాభిమాని
పుణ్యకార్యతత్పరుడు, దాక్షిణ్యపరుడు
వినుతశుభకీర్తి సహితుఁడు, విప్రహితుఁడు
సకలజనపాళివినుతుఁడు, శాంతియుతుఁడు
శ్రీయుతుండగు మాతమ్మిరెడ్డి, కీసు
కృతిని, సన్మతి, శాశ్వతాంకితముగా స
మర్పణముఁ జేసినాడ నా నేర్పుకొలఁది ॥

యతని కీర్తి నెలవలె నలరుఁగాత
భోగమిందిరవైభవమును బొలుఁగాత
భాగ్యమిందిరాసతిచెల్మిఁ బడయుఁగాత
యాయువు శతాధికంబయి యమరుఁగాత
యుత్తమారోగ్యసంపదనొంది, బహుళ
పుత్రపౌత్రపరంపరల్ బొంది యతఁడు
నిత్యకళ్యాణములనంది నెగడుఁగాత ॥

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీగురుభ్యోనమః

శ్రీగణేశాయనమః॥ శ్రీశారదాంబాయైనమః॥

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమ త్సమేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః॥

## —* శ్రీ గురుస్తుతి *—

శా॥ శ్రీదైవాఱఁగ శిష్యవర్గముల సంప్రీతాత్ములై యేలి స
మ్మోదంబొప్పఁగ జ్ఞానమార్గముల నుద్బోధించి, యీధాత్రినా
నా దేశంబులఁ బూజనందిన చిదానందాహ్వయాస్మద్గురుౕ
ఆదిన్ మ్రొక్కెద భక్తితోడఁ దదమోఘాశీర్వచఃప్రాప్తికై॥

## —* శ్రీ వాగీశ్వరీస్తుతి *—

ఉ॥ ఆగురుసార్వభౌముని దయారసముంకువగాఁగఁ బుణ్యసం
యోగముచేతనొందెను ఫలోదయ మేయమగొల్చితీవె యా
వాగధినాయిక, స్వరమపావన బద్మజురాణి భక్తిమై
నేఁగొలుతుౕ మదీయకృతి నెమ్మదలిర్పఁగ నిల్చి ప్రోవఁగాౕ

## —* శ్రీ విఘ్నేశ్వరస్తుతి *—

మ॥ జననీహస్త విరాజితేక్షుధనువుౕ సొంపొటుగావింపఁగా
జనకోత్తంసలసన్నదీజలము నాస్వాదింపఁగా మెల్లమె
ల్లనఁదొండంబునుసాచి పిన్నదనముౕ లాలించుమాతాపితృల్
గని నవ్వంగ నొసర్చుదంతిముఖు విఘ్నస్వామి బ్రార్థించెదౕ॥

## —✻ ఇష్టదేవతాస్తుతి ✻—

చ॥ పరమసుఖాస్పదంబయిన భవ్యవికుంఠనివాస మీధరన్
దిరుపతిగాఁగ, నక్కనను దేజఁదలిర్పవసించు కల్మిదే
వెలి యలుమేలుమంగగను; విష్ణువె తానుగఁగల్గి భక్తులన్
బాఁపొరిఁబ్రోచు వేంకటవిభుందలఁతు నస్మదభీష్టసిద్ధికై॥

## —✻ ఆంజనేయస్తుతి ✻—

కవిరాజవిరాజితము.

వననిధిఁ గొంచెపుఁగాల్వనుబోలెజవంబు 'సెబా'సనదాటెనెవం
డనిశము శోకులవోమలపాలిటి యుబ్బురపుంబెనుగాడు పెవం
దనఘ రఘూద్వహ పూతకథామణిహారమునం బదకంబవఁడా
తని, హనుమంతు, మహాబలవంతుని, దాంతు, నుతింతుఁ దలంతు మదిన్.

## —✻ కవి నమస్కృతి ✻—

క॥ నతిఁజేసెదఁ దమపల్కులఁ
జతురాననుమించి సర్వజగములయందున్
నుతికెక్కిన ఘనులను సు
వ్రితగీర్వాణాంధ్ర సుకవిపంచాననులన్ ॥

శ్రీ

# రామకుమారాభ్యుదయము.

ప్ర॥ సూత్రధారుఁడు.

( నాంది. )

మ॥ ఒకఁడై, జ్ఞానమయాత్ముఁడై, యగుణుఁడై, యొప్పారి, లీలా మహా।
త్మకతన్ మాయనుబొంది, లోకచయముల్ దోడ్తోడఁ గల్గించి కా।
చుక నింపొందఁగఁ బ్రోచుచున్, గుశలవంతుండై మఱిన్ మాయఁ జే।
ర్పక భాసిల్లు పరాత్పరున్ మునిమనోరామున్ భజింతున్ మదిన్॥

సూత్ర—నటీ! (అని పిలిచి) నటి యింకను రాలేదు. ఎంత వేగిరము రమ్మన్నను స్త్రీలు మఱింత జాగుసేయుదురు. ముఖ్యమైయిన కార్యములయెడ మఱింత తడవొనర్తురు. వీరికి మందగమనలని పెద్దలిడిన పేరు సార్థకముగా నున్నది. దీనికిం దోడుగా మందమతులనికూడఁ బిలువఁదగునని నేనెంచెద.

ప్ర॥ నటి.

నటి—నాథా! మందమతులెవరు?

సూ—ఓహో! కడమాట నీచెవిఁబడెనా? మీరే భామలు.

నటి—అదేల?

సూ—ఏకార్యమునకును శీఘ్రమున రమ్మనిన రారని.

నటి—అటులయిన మమ్ముల విడిచియే మీరెల్ల కర్జముల నొనర్చుచున్నారా? మేము లేనియెడల నీప్రపంచనాటకమెట్లు జరుగును?

సూ—నిజమే, సరిగాఁ జెప్పితివి. మీతత్త్వమే ప్రపంచనాటకమునకుఁ గథానాయిక, సద్రంగస్థలమునకుఁ బునాదిరాయి. ప్రపంచ నాటకమట్లుండనిమ్ము. ఇప్పుడు మన నాటకమును గురించి మాటలాడుకొందము. ఈ సభాస్తారుల నలరింప నేనాటక ముప క్రమింతము?

నటి—మీచిత్తము. దేనికైనను నేను సిద్ధముగా నున్నాను.

సూ—అయిన, రామాయణములో—(అర్ధోక్తి.)

నటి—ఏమి? రామాయణమనుచున్నారే! ఇఁకఁ బోదము రండు. ఈ సభాసదుల రంజింపఁజేసినట్లే. వీరల నందఱిని సింహాసన మరలు నట్లు వేసి క్షమింపఁ గోరుఁడు. రామాయణములు, భారతము లింకాడెవఁకిఁ గానలెను? చర్విత చర్వణములు. కల్పితకథలా, పరిశోధకములగు నవలలా, నూతన నాటకములా మనస్సుల రంజింపఁజేయుటకు? రామాయణ మెవరికిరుచించును? ఎవరికిఁ దెలియనికథ? ఎందఱో మహానుభావులు రచించినారు. ఈ మహానుభావుఁ డెవ్వఁడో?

సూ—అటుకాదు. నీవన్నవిధమునఁ జర్వితచర్వణమేయయినప్పటికిని భగవత్కథయగుటచే నది యెప్పటికిని నవీనముగానే పరిఢవిల్లు. ప్రాఁతదికానేరదు. శ్రీవాల్మీకిమహర్షివిరచితరామాయణమునేకదా యనేక కవిపుంగవు లనేకవిధంబులఁ గృతులనొనర్చినారు. అట్లని, వారి వారి పాండిత్యగౌరవమును, శేముషీవిశేషమును, గవిత్వమహత్త్వమును లోకము ప్రశంసింపకున్నదే? కావునఁ బురాతన కథయని రామాయణముం దృణీకరింపనగునా? శ్రీరాముని చరిత్రమెవ్వరికి రుచింపకుండును? పుణ్యమును బురుషార్థమునొసంగు. ఎన్నిసారులు చదివినను విన్నను, నాటకములఁజూచినను దానియం దభిరుచి కొఱవడునా? చెఱుకునెవరు తినినను దీపేకదా! ఎన్నిమారులు తిన్నను దియ్యఁదనమే కదా! కావునఁబృథివింగల రామాయణములలో నిదియొకటియని

యనుకొనుము. రచించిన వారిలో నితఁడొకఁడని యెన్ను
కొనుము.

నటి—కానిండు! మీతో నేమాటాడ నేర్తునా? విషయమును బూర్ణముగాఁ
జెప్పుఁడు.

సూత్ర—రామాయణములో శ్రీరామపట్టాభిషేకానంతరము జరుగు
కథలోని కొంతభాగము.

నటి—సరే! ఉత్తర రామాయణములోని భాగమని చెప్పఁగూడదా?

సూత్ర—నీవు, బుద్ధిమంతురాలవు. కనుఁగొంటివే.

నటి—ఇపుడు మందమతిని గాదుకద?

సూత్ర—సరే! పోనిమ్ము. అప్పుడన్న మాటకిప్పుడు చెప్పెదవా? నీవు
కనుగొన్న రీతి మన నాటకము పేరు రామకుమారాభ్యుదయము.

నటి—అంత పెద్దకథకు మనకున్న కాలము చాలనలయుంగదా!

సూ—కవియు నీకొఱకే సంగ్రహముగా వ్రాసియున్నాడు.

నటి—ఆకవి యెవరో నాకు విన్పింపలేదే. పూర్వకవియా? ఆధునికుఁడా?

సూత్ర—పూర్వక వీశ్వర చరణారవింద భజనానందుఁడును, వర్తమానకవి
తల్లజ చరణసేవకుఁడయి

గీ॥ ధాత్రినెలసెడు కౌండిన్యగోత్రజాతుఁ।
దాఱువేల ప్రసిద్ధవంశాబ్ధిపిచి।
యనఘుఁడగు పెద్దనా రాయణార్యసుతుఁడు।
ప్రాజ్ఞసంసేవి గా సుబ్బరాయసుకవి॥

నటి—ఆఱువేల వంశమనఁగాఁ గవివంశమనియు బ్రాహ్మణుఁడనియు
నెఱింగితి. గా. యనునది సందిగ్ధముగానున్నది. ఏమియో తెలియ
లేదు.

సూ—'గా' 'అనగా గారలదిన్నె' యని అతని గ్రామనామము.

నటి—సరియే.

సూ—ఈ ప్రేక్షక మహాశయుల నాహ్లాదింపఁ జేయమనయందుఁ గూడఁ
గొంతభారముంచినాఁడు.

నటి—అది తెలిసినయంశమే. చెప్పవలసినదేమున్నది. ప్రతినాటకకర్తయు నెక్కడనో యొక రమ్యప్రదేశమునఁగూర్చునిబుద్ధికిఁదోచినటులు వ్రాయునే కాని యతని వ్రాతలయందుఁ గల రసముల భావములనెల్ల వెల్లడించువారము మనముకాదా? మనము లేకున్న నా నాటకము లేమగునో?

సూత్ర—చెలీ! నీకెంతయభిమానము! అట్లుగర్వ పడకుము. రసభావాది ప్రదర్శనము సామాన్యముకాదు; నేనొప్పుకొనుచున్నాను. అయిన వ్రాయఁబడిన నాటకములయందలి సారస్యమునీవేకనఁ బఱచుచున్నావా? వానింజదివియందలి రసాతిశయములంగ్రహించి యానందించు ప్రజ్ఞావంతులు లేరనుకొన్నావా?

నటి—నాథా! మీతో నే వాదింపనేర్తునా? వేళయగుచున్నది.

సూ—ఇఁకనేమి, ఋతువర్ణనముతో నుపక్రమింతము. పాడుము.

నటి—ఏఋతువును గూర్చి?

సూ—సకలపశుపక్షిమృగాదుల కాహ్లాదకరమగునదేదియో, సర్వవృక్షజాతి పుష్పఫలభరితమై యెప్పుడొప్పసలారునో యాఋతువు.

నటి—వసంతమా? అయిననావసంతు డెచ్చట దాండవము సేయుచుండునో యట్టి వనముయొక్క శృంగారమును వర్ణించెదను.

సీ॥ మిగులఁగెంజాయచే మెత్తని దనముచే
నమరుచిగుళ్లు హస్తములు గాఁగ
జిన్నవై నునుపొప్పి చెన్నెసలారెడు
తీవియల్ తనమేనుతీరుగాఁగ।
మల్లెలు మొదలయిన తెల్లపూమొత్తంపు
భాతికపోల విభూతిగాఁగ।
నింతింతలై రసవంతంబులై యొప్పు
పండ్లయందఁబెపాలిండ్లుగాఁగ।

గీ॥ మేలిపువ్వు గుత్తులపైని గేళిసలుపు।
తుమ్మెదలు చూచుకమ్మలఁదోపఁజేయు।
నోలి విసరెడుగాడ్పు నిట్టూర్పుగాఁగ।
గర్భవతి నాఁగ నారామకాంతయలరె॥

(నేపథ్యమున)

"ఓహో! ఏవ్వతెయో చూలాలని మాసీతాదేవిని గూర్చిగానము చేయుచున్నది"

నటి—నాథా! నాపాట నెవరోవినినారు. సీతాదేవినిగుఱించి నేనేమంటిని?

సూ—ముగుదా! నీపాట చివర గర్భవతి నాగ నారామ కాంతయలరె యనినమాటకు రాముని కాంతగర్భవతిగా నొప్పెనని యర్థము చేసికొని వనవిహారమునకుంబోవు నామెచెలికత్తె పల్కినది. నీదు గానమునందే కథ నుపక్రమించితివి. ఇఁక బోదమురమ్ము.

ఆ॥ వె॥ కథయుఁ గ్రొత్తగాదు కయితమాటలు క్రొత్త।
కావు వినఁగమీరు కారు క్రొత్త।
కవియెమాత్రక్రొత్త కానదోషముపీడి।
గుణముమాత్రమదిని గొనుఁడు బుధులు॥

(సూత్ర॥ నటి నిష్క్రమింతురు)

ప్రస్తావన

# రామకుమారాభ్యుదయము.

## ప్రథమాంకము.

అయోధ్యానగరప్రాంతవనము.

ప్ర॥ సీత, ఇందిర (సఖి)

సీత—ఇందిర! ఎవరును గనుపించ లేదు.

ఇందిర—దేవీ నీవు గర్భిణి వెపుడయ్యెదవో యని యెవ్వరో సంతోషము
తో బాడుచుండిరి కాఁబోలు. యెల్లయెడ నిదే ముచ్చటించుచున్నారు.

సీత—చెలీ! చాలు, లెమ్ము. ఈ వనవైభవమును చూతమురమ్ము.

ద్విరదగతి రగడ॥

ఘుమ్మనుచుఁ దావులం। గుసుమములు విసరెడిని।
ఝుమ్మనుచుఁ దుమ్మెదలు । సుమములఁ ముసరెడిని।
కమ్మనిఫలమ్ములం । గరమొప్పు కొమ్మలను।
గ్రమ్ముకొనె చూడుము శు । కమ్ములు పికమ్ములును॥

ఇందిర—సీతాసతీ! కనుము చిగురు లెత్తుఁదనము।
ఛేతోముదంబొనర్చుగద సొగసుందనము

సీతా—రంగారుకొమ్మలు క । రమ్ములఁ ధరియించు।
నుంగరపు గెంపుగమి । యోయనంగ రహించు

ఇందిర—పరికింప పీనినీ । ప్రాణేశుఁడలుగంగ।
గరమొప్పుతామ్రాక్ష । గతిగాదె పలుకంగ॥

సీత—నీవల్లు చిన్నారి । నెఱపల్కులవిధంబు
తీవలలికగంటె । తేజరిలినడంబు

ఇంది—ఈతీవియలను । య్యెలలఁగాగావించు
ప్రీతిమైనూగుదమె । ప్రియచెలుల రావించి॥
సీత— తీవెలగపడకుండ । దీపించుపుష్పముల
కావహిల్లును చేంట్ల । కానందబాష్పములు।
ఇంది—అక్క! యాచక్కఁగను । మలరుదేనియధార
లొక్కకాల్వఁగ బాఱు । చున్నయవి ముదమార।
సీత—కఁడగి యాపూదేనె । కాల్వఁబాఱగనీక
పడిన పూదుమ్మొకు । ప్పలజూడవలెగాక।
ఇంది—దేవి! ఈ కుసుమములలో నీకెయ్యవియిష్టమో వానినిఁగోసి తెచ్చెద.
సీత—సఖి! అన్నియు మనోహరమైన వాసనగలవియే. అన్నియు నిష్టము గా నే తోఁచుచున్నవి. అయిన నీపారిజాతముల సేకరింతును (అని కుసుమాపచయ మొనర్చుచుందురు).

ప్ర॥ శ్రీరాముఁడు—మెల్లగ.

(ఇందిర రామునిఁజూచి తొలఁగిపోవును.)

(శ్రీరాముఁడు వెనుకనుండివచ్చి సీతకన్నులుమూయును).

సీత—ఇందిర! ఇదియేమే, తీయుము. ఏమి! ఇందిరకాదా? నీవా? శ్యామలా! తీయవే కరములు. ఏమిది? శ్యామలయుఁగాదా! (అని రాముని చేతుల దడవిచూచి) ఓహో! శ్యామలాంగుఁడు, శ్యామసుందరుఁడు, నీలమేఘశ్యాముఁడు. (రాముఁడు హస్తముల విడలి కౌగలింపఁబోవును. సీత వెనుకకు జరగును.)
రాము—సీతా! నన్నెట్లు గుర్తించితివి?
సీత—ఈ పరిహాస మొనర్చువారు మీరును, నాచెలులు తప్ప మఱి యెవరు? మీవ్రేలినున్న మణిముద్రికను గుర్తింపనా? ఇచ్చటి కెట్లు వచ్చితిరి?
రాము—సీతయను విద్యుచ్ఛక్తి నీలమేఘశ్యాముని, నింకేమియో సుందరుఁడని యంటివే వాని నాకర్షించినది. నీ వొంటిరిగా నున్నావేల?

సీత——ఒంటిరిగా నున్నానా? జతతో నున్నాననియే తలఁచుచున్నాను.
రాము——అటుకాదు. ఇంతకు ముందని యంటిని.
సీత——ఇంతవఱకు నాచెలితోఁ గలిసియుంటిని. మీరాకఁజూచి యది కుశలమతిగనుక తలఁగిచనినది. ఈవనమునందే యెందో యుండును
రాము——ప్రాణేశ్వరీ! ఈ వనశృంగారము నేమని చెప్పనగును.
సీతా——నాథా! కన్నుల పండువుగా నున్నది.
రాము——ఇంతియేనా?
సీత——మనబోఁటివారు విహరింపఁదగిన మనోహరసీమగానున్నది.
రాము——అనఁగా, రాజులు, రాణులనియా?
సీత——కాదు.
రాము——స్త్రీలు పురుషులనియా?
సీత——అదియుఁగాదు.
రాము——ప్రేయసీప్రియులనియా?
సీత——ఏమియోనాకు తెలియదు. (అని చిఱునవ్వు నవ్వును.)
రాము——అదిగో! అదియేనీయభిప్రాయము. కాంతామణీ! మీహృదయములతిగూఢములు. నిన మెచ్చితిని, ఇట్టిరమణీయవనమువసంతసామ్రాజ్యసింహాసనముకదా! అంతమాత్రమేనా?

సీ॥ వనమా! రతీపంచబాణాతిశయసుఖా
స్పదలసత్క్రీడా భవనముగాని।
వనమా! విరహతాపవహ్నిప్రవర్ధన
వ్యాజభూత మహాపవనముగాని।
వనమా! శుకమయూరపారావతపికాది
పక్షిసంతాన జీవనముగాని।
వనమా! ధరాతలపటభాగవిధిచిత్ర
కారచిత్రితవిలేఖనముగాని।
గీ॥ సారఘనసార కేసరచందనాది।
సర్వసురభిళవస్తు ప్రశస్యమాన।

మాధవసుగంధకారధామంబుగాని।
వశమె! కొనియాడఁ దీనిని వనరుహాక్షి॥

సీత—ప్రాణేశా! మీరువర్ణించిన దెంతయు నిక్కమే. ఈవనమనోజ్ఞమును జూచి మరలిపోవ మనసురాకున్నది.

రాము—హృదయేశ్వరీ! పుష్పవంతములగు నీచెట్లు లెట్లులున్నవో తిలకించితివా?

క॥ భూజాతవగుటచే నీ।
భూజంబులు చెల్లియండ్రు • పోలెనిను సం।
పూజింపఁగఁ గేలఁ సుమ।
రాజిఁ దాల్చినవి, చూడుము, • రాజీవాక్షీ॥

సీత—నాథా! చెట్లను నాకుఁ జెల్లెండ్రుగాఁ జేసితిరా! ఈ శాఖానికరమనేకములైన యాఁకులచే నేకరణి నిండియున్నవో చూడుఁడు.

క॥ కొమ్మలు మానినులగుటన్।
నెమ్మేను లెఱుంగఁ బడక నెఱి పచ్చని పు।
ట్టమ్ములఁ గట్టిన క్రియఁ బ।
ర్ణమ్ములు విలసిల్లుఁగాదె! రమణీయముగాన్॥

రాము—సీతా! నీవు కొమ్మవగుటంజేసి కొమ్మల నెంత శృంగారమ్ముగా వర్ణించితివి. మీరే గ్రంథములను వ్రాయఁబూనినచో శృంగారరసముం జప్పలఁ జేయుదురు కాఁబోలు. ఈ మహీజము లెంత మనోజ్ఞముగా ఫలభరితములై యున్నవి. చూచితివే? మహాయోగుల తపస్సులవలె, సత్యసంకల్పుల కార్యముల కరణి, సత్క్షితీశ్వరుల కృతులమాడ్కి, సత్పాత్రదానంబుల పగిది, సఫలీకృతములై యున్నవి.

సీత—దేవా! నిక్కము. ఈ పనసచెట్టును గనుఁగొనుఁడు. నిలువెల్ల జాళ్ళను గట్టిన విధమున భారమగు పండ్లనెన్నింటిని గలిగి యున్నదో దీనికి బరువు కాదేమో?

రాము—సఖీ! అది యెటులగును!

చ॥ తనయుల వెంద తేనియును • దైవకృపన్ జనియించి రైనయా।
పనసవలెన్మహా కఠిన • వర్తనులైనను, దల్లి మక్కువం।
గనుచు భరించుఁగాక, పలు•కష్టము లొందియునైన నప్రియం।
బును బొడసూపునే, విసుగుఁ•బొందునె, యొక్కనినైన నీడునే॥

సీత—నాథా! అదియు నిజమే.

రాము—దేవీ! ఈ వనమంతయుఁ జూడ నిన్నుఁ జూచినట్లె యున్నది

సీత—అదెట్లు?

రాము—మత్తకోకిల॥

నీలవేణిరో! ఈతమాలము • నీకురుల్వలె నొప్పునే

సీత—చాలు! మీతనుకాంతియే యొక • సక్కెమాడదె దానినిన్।

రా—పోలఁజూడఁగ నీప్రవాళముఁ • బోలు నీయధరోష్ఠమున్।

సీత—చాల మీరలు కిన్కఁ బూనిన • చందమిట్లని చూపదే।

రాము—జీవితేశ్వరి! నీదు చేతుల • చెన్ను మీఱెడు తీవెలున్।

సీత—దేవ! మీరలు కూర్చు నల్లుల•దే విధంబుగ మించవే।

రాము—మోవిపానక మొప్పురీతిని • బూవుఁదేనెలఁ జూచితే।

సీత—తావకీనదయాసుధారస•ధారకన్న విశేషమే।

రాము—మల్లెమొగ్గల నీరదంబులమాడ్కి • పొందికఁ గంటివే।

సీత—వల్లభా! తమకీర్తిచంద్రిక • భాతినెంతయు నొప్పవే।

రాము—పల్లవంబులు నీకరంబుల • భంగిమంజులతందగెన్।

సీత—కల్ల! మీమనసొప్పు చందము•కన్న మెత్తఁగ నున్నవే।

రాము—జానకీ! గజనిమ్మపండుల • జాడనెంతయుఁ జూడఁగా।

సీత—మానుఁడీ యిఁక వర్ణనంబుల • మాటుపల్కఁగఁ జాలను

రాము—ఉ। ద్యానమారయ నీమయంబుగ • నంతటన్ బొడగట్టెడున్।

సీత—కాన, నాయెడ నంత మక్కువఁ • గల్గనెంతటి ధన్యనో॥

రాము—సీతా! మాటలయందు నిను గెల్వఁజాలఁజుమా. అదిగో యది యేకదా యశోకవృక్షము.

సీత—ఔను. అద్దియే. ఎన్ని చెట్టులలోనైన దానిని గుఱుతింపఁ గలను.

రాము—ఈవృక్షజాతినిఁ గొట్టించి వైచెదను.

సీత—ఏల?

రాము—ఈ యశోక మహీజము క్రింద నేకదా నీవు మిక్కిలి శోకించుచుంటివి.

సీత—నాథా! నాశోకమునకై యశోక మేమిచేసెను. నాపూర్వ జన్మార్జిత దుష్కర్మ పరిపాకము, దుర్విధి బలాతిరేకమును నా శోకమునకుఁ గారణములై యుండఁగాను యశోకము నేల దూఱవలె, మఱియు నది తన నీడనిచ్చుచు, గాలివిసరుచుఁ దన ధర్మమును నెఱవేర్చుచుండె ఒకవేళ మీరిప్పుడు నన్ను మరల నెడఁ బాసినను నట్టి యశోకము దాపునే చేరినను దాని ధర్మమునే సలుపునుగాని యొం డేమిచేయదు.

రాము—సీతా! అశ్లీల నశ్లీలముం బల్కితివి. దోషము లేదనుము, నేను మాట చాలుగా నంటిని. నీశాంతగుణ మగ్గింపఁదగి యున్నది. నీవన్నటుల విధివశమున నల్లెడఁ బాసియుంటిమి. ప్రాణప్రియమా! చంద్రుఁడు తన చంద్రిక నెడఁబాసినను ప్రభాకరుఁడు తన ప్రభఁదొలఁగినను నిన్ను విడనాడువాడఁగానని యెంచుము.

సీత—స్వామీ! నేనును మాటవరుసగాఁ బల్కితిని. మీచిత్తము నే నెఱుఁగనా? మీభుజాపరిరంభణమెన్నఁటికిని బాయుదానఁగాను అందుకు నీబహువిధమహీరుహములఁ గౌగలించుకొన్న యీలతావితానములే సాక్షులుగా నెన్నుకొనుఁడు.

రా॥ గీ॥ తేనియనుమించి ద్రాక్షను దీసివైచి।
యమృతమును ద్రోసి చక్కెర నపహసించి।
యొప్పునీపల్కు చవియెంతయున్న దొక్కొ।
చూడనీయవే జానకీ! సొంపునింప॥

(అని ముద్దిడుకొనఁబోవును)

(నేపథ్యమున)

గీ॥ పశ్చిమగిరీంద్రముం జేర భానుఁడరిఁగె।
కమలజాతికి ముఖవికాసములు తఱిగెఁ।
గుముదసంతతులకు నుత్సవముఁలు పెరిగె।
గడువడిఁగ గూడులకుఁ బక్కిగముఁలు తిరిగె॥

సతీమణీ! సాయంసమయమైనది. ఇఁక బోవుదమురమ్మ. నీచెలితోఁగూడిరమ్మ. (రాము—నిష్క్రమించును.)

సీత—ఇందిరా! (అనిపిలుచుచు) నిష్క్రమించును.)

ప్ర॥ భద్రుఁడు.

భద్రు—(స్వగతము) మాయేలికయగు రామభద్రుఁడునాయందలిప్రీతిచే భద్రా! నీవేయిప్పుని నానర్పుమని యేకార్యమును చెప్పుచుండును. తన యంతఃపురకార్యములకు నన్ను యజమానునిఁగా జేసియున్నాడు. అదియునుగాక నాపైని నమ్మకముచే నీ గూఢచారిత్వమునకు నన్నే నియమించియున్నాడు. రాజసేవసామాన్యమైనది కాదు.

ఆ॥ వె॥ చేయకుండరాదు చేసియుఁదప్పను!
జేయరాదు. జాగు సేయరాదు।
తప్పుసేసినపుడు దానిదాచఁగ రాదు।
రాదు కల్లలాడ, రాజసేవ॥

ఇట్టులుండఁగ నీగూఢచారిత్వము కష్టతరమైనది. మాఱువేషమున రాత్రికాలమున సంచరించుచు నితరులెఱుగకుండ నచ్చటచ్చట జరుగు సంభాషణముల వినివచ్చుట. ఇట్టి కష్టముకలదియైనను మాప్రభువుచూపు ప్రేమను బట్టి మిక్కిలి యుల్లాసముతోఁజేయుచున్నాను. సేవకునిశ్రమను బ్రశంసించి ప్రీతిఁ జూపువాఁడేకదా ప్రభువు.ఇప్పుడు రెండు జాములరాత్రి యగుచున్నది. మంచిసమయము. ఈవీధి వెంబడినే పోయెదను. అదిగో యెవరో

యెదురుగవచ్చుచున్నారు, వారు దాటిపోవువరకు నిందుదాగి యుండెదను.

ప్ర॥ ౪రు పౌరులు.

జాబాలి, కాపాలి, గోపాలి, తిరుమలి.

కాపా—అయ్యా! జాబాలి ! యిదియేనాయుమామహేశ్వరుని దేవాలయమునకు దారి. ఇటువచ్చితిమి. అప్రక్కకదా?

జాబా—కాదిద్దియే చూచితివా, కాపాలీ ! మనప్రభువీ బాటల నెంతనీటుగా వేయించి యున్నాఁడో, యాదీపముల నెంత కాంతి మంతములుగా నంతటఁబెట్టించి యున్నాడో మనసుఖమునకే.

కాపా—ఔను. కడుధార్మికుఁడు. మిగులదయాళువునుగదా మనరాజు.

గోపా—ఏమి! కపాలస్వామీ? ఎక్కడపోతావుండారు!

కాపా—ఎవరువాండ్రు?

గోపా—నేనుగోపాలి, యీడునానేస్తకాఁడు తిరుమలి.

కాపా—మీరా! మేముమామహేశ్వరుని దేవస్థానమునకుబోవుచున్నాము. అచ్చటఁ బురాణముఁ జెప్పుచున్నారు

తిరు—మేమొస్తాము. ఏంపురానం.

జాబా—ఈదినం 'శివమహిమను' గుఱించి

గోపా—ఆహా! ఏమిస్వామీ! రాంమయిమకంటె నా చివమయిమ. మారామస్వామి కాలిదూలి సోకెనంటె రాల్లు సక్కనిఅమ్మ వాళ్లు అవుతారు. ఆచివయ్య యిల్లనంబేకదా యీరామయ్య యిరిసిండాఁడు.

కాపా—నీవుబుద్ధిమంతుఁడవు. కనుగొన్నావు. మనరామచంద్రునికన్న దైవమున్నాడా! నిజమే. తండ్రియాజ్ఞను పదునాలుగు సంవత్సరములడవులఁదిరిగివచ్చి నెరవేర్చినకుమారుఁడు. శివుని వింటిని విరిచి సీతాదేవిని పెండ్లియాడిన శూరుఁడు, రాజాంతకుడగు పరశురాముని గర్వమునణచిన వీరుడు. జగత్కంటకుడగు రావణాసురుని

సంహారించిన లోకోపకారకుడు. రాక్షసి కూడవలచివచ్చియుండిన సుందరాకారుడు. లాతినాతినిచూచిన తనమాతనువలెఁ గాంచు ధీరుఁడు. సదాచారుఁడు. సత్యవిచారుడు. పాపవిహారుఁడు. పరమోదారుఁడు.

తిరు—బళీ! బళీ! బాగచెప్పితివిస్వామి! అయితే వాల్నిసూడకమునుపే సుగ్రీవునికి రావనాసురున్ని గుర్తెరక్క మునుపే యిబీసనికిపట్టాభిసేకాల్గట్టిన పరాక్రం సెప్పక పోతివే!

జాబా—సెబాస్! నీవుబాగుగాఁదెలిసికొన్నావు.

గోపా—అంతేనా, పాదాల మీద బడి అడిగితే పానాలయిన ఇచ్చే వాడు. మారాన్న బావుఁడు

జాబా—నిజమేశరగతత్రాణుఁడుగదా'

తిరు—అంతేలనోయి రాజంటే రామరాజే స్వామిఅంటే రామస్వామే సూడు ఎన్నాల్లకెన్నాల్లకేగాని మాకు రామశెంపెరుఁడేరాజు గావుణ్ణిఏమిస్వామి?

కాపా—సంతోషము! పురాణమునకుఁ బ్రొద్దుపోవుచున్నది. పోదము. రండు. శివునిమాహాత్మ్యమిట్లే యుండును. మనకు దైవమంతేయు నాకటే?

గోపా—పోదాము పాండి యినివత్తాము పున్నె మే తప్పదు.

నిష్క్రమణ

భద్రుడు—(ముందుకువచ్చి)ఆహా! మారాజ నెంతపొగడుచున్నారు! అతని చరిత్రము నెంత తలంచుచున్నారు, ప్రజల కతనియందుఁ గలభక్తి నేమందునుజనుల మనస్సుల నిట్లు రంజింపఁజేయఁజాలిన వాఁడేకదా "రాజు"అనుటకుం దగినవాఁడుఏలిక యెడ నిట్టి ప్రియమేకదా జనుల కుండవలయును.

ప్ర॥ నలుగురు పురజనులు

౧వ వాడు—కాదురా నే జెపాను యిను ఈడ యెవరు లేరుకదా?

భద్రు—స్వ॥ ఓహో! వీరెవ్వరో రహస్యము మాటలాడుచువచ్చుచున్నారు. దీనిని వినవలయును. నే నిందుదాగియుండెదను.

(అని ప్రక్కన నిలిచి యుండును)

౨వ వాడు—ఎవరు లేరులే ఈ దేవదుండాడు రాత్రి సెప్పు?

౧వ వాడు—ఒకనాడా రెన్నాల్లా పదినెల్లుగదా సీతమ్మవారు లంకలో వున్నింది రావణాసురుని సోదీనంలో.

౩వ వాడు—ఔలే

భద్రు—ఓహో! వీరెవ్వరో సీతాదేవినిగూర్చి పశ్చాత్తాపమును జెందుచున్నారు కాంబోలు

౪వ వాడు—సోదీనంలో కాదురా నీ, వానివనాంతరములోబెట్టిన్నంటి.

౧వ వాడు—వానియిల్లేమి? వనమేమి? వానిసేతులో దేగదర? వాడు పరమదురమారుగప్పు నాయాలు ఎందరోన్ని ఆడోల్లను పట్టుకొని నచ్చియేశిన్నాంట, ఈ సక్కనమ్మను యిడిసంటాడా, అనుకోరాదుగాని

౨వ వాడు—ఔలేప్ప ఆడదాని ముంపర మొగోడుఅగ్గియిడిట యిన్నంట

భద్రుడు—హా! హా! (అని చెవుల మూసికొని) వీరెవ్వరోనీచాధములుగానున్నారు ఎట్టి పిడుగువంటి మాట నా చెవిని వేసిరి. యింకేమి యనుచున్నారో?

౩వ వాడు—అట్లాంటి అమ్మను సుద్ధమని నమ్మి యీతిక్క రామస్వామి కొండొచ్చుకొని కాపురం సేస్తావుండాడు ఏమిఅన్యాలంరా!

భద్రుడు—(స్వ) అయ్యో! రాజేంద్రుని సయితము నీనీచపుముండకొడుకులు దూషించుచున్నారు. వీరిని బంధించుకొని పోదునా? అకటా రాజాజ్ఞలేదే!

౨వ వాడు—నేనైయింటేయింట్లో పెండ్లాన్ని నరికి పారేస్తావుంటి

४వ వాఁడు.—కాదుర, నాయాల్లారా ఊరికే తప్పుడుకూతలుకూస్తుం డా'రే, సీతామ్మవారు అగ్గి అట్లామంచి అంటనే. అగ్గిలో పేరు మాణం చేసిందంటనే దీనికి జెప్పు.

(భద్రుఁడు) స్వ॥ వీఁడు కొంచెము వివేకి

౧వ వాఁడు—పోసినీ పెరుమాణమూరు మాణమూ. ఆసుద్ది ఆకోతులన్ని చెప్పిందేకద. సముద్రందాటి పోయి నీవు సూచి వచ్చిండావా?

3వ వాఁడు—ఈనికేం దెల్చులే, పిల్ల నాకొడుకు

౨వ వాఁడు—ఒరే! ఎవరెతోనినాకురోపానానిక వచ్చిని.

(భద్రుఁడు) ఓరీ' చాండాలులారా! (అని పండ్లు పటపటఁ గొఱికి ముందురాగా, అందఱు పరుగెత్తుదురు.)

అయ్యో! నేనిపుడేమి సేయుదును, ఈ దుర్మార్గుల శిక్షించుటకు నాకాజ్ఞలేదయ్యె. నేడెట్టి కఠినవార్త వింటిని. ఇన్ని దినములుగా సంచరించుచునొక్కనాఁడైన నిట్టిచెడ్డసుద్దివినలేదే. ఈ దిన మెంతదుర్దినమో తెలియదు. కడుఁ బవిత్రులైన వారిని, మమ్మెల్ల సంరక్షించు రాజును, రాణిని, నీదుర్జనులెంతగా నిందించిరి. ఈ ముండకొడుకుల కెంతటి పాపము రానున్నదో? అకటా! యీ వృత్తాంతము ప్రభునికెట్లు విన్నవింతును? కొఱవులఁ జెవులలో దూర్చినట్లగునుగదా! అతఁడిఁక సీతాదేవి ముఖమును చూచునా! ఒక్క నిమిషమతనికి నిద్రపటునా? శరీరమునఁ బ్రాణములుంచుకొనునా! నగరమంతయు నల్ల కల్లోలముకాదా! రాష్ట్రమంతయు నుడికిపోవదా? ఛీ! ఛీ! ఈవార్త స్వామికిఁ జెప్పఁదగినదియేకాదు. చెప్పనక్కఱయే లేదు. ఈ నీచుల మాటలఁ జెప్పకున్న నేమి తప్పు? వీనిని నిక్కముగా దాచెదను. తక్కిన సుద్దులఁ జెప్పెదను—అయ్యో—దాచిన నెట్లు? అబద్ధమాడుట యొకటి, నమ్మకపు ద్రోహము రెండు, రాజద్రోహము మూఁడు, ఈమూఁడు పాపములు ముప్పిరిఁగొని యాదుష్టాధములకంటె నెక్కువగా నన్ను ముంచి

దైవమా? అక్కటా! నేనేమిసేతును. ఱేఁడు నన్నేల నీకార్యమునకు నియమించె. ఇన్ని దినములు సుఖముగా గడచి నేఁడేదియో ఘోరము సంభవించె. హా! దైవమా! ప్రభువు నొద్దకుఁ బోవక తప్పదు. పోయెదను. వాఁడుక వార్తలన్నియు విన్నవించెదను. అందుపై నతఁడు నన్ను విడిచినయెడల సెలవుఁ గైకొనెదను. లేక క్రుచ్చిక్రుచ్చి నన్నడిగినయెడలఁ జెప్పక తప్పించుకొనఁగలనా? బ్రదికిపోఁగలనా! తల్లీ! సీతాదేవీ! నీపుణ్యమెట్లున్నదో?

క॥ పుట్టితివి జనకు నింటన్।
మెట్టితి దశరథ నృపాలు మేటి గృహంబున్।
బట్టితివి రాముకేలోఁ।
గట్టితివే దుష్టజనుల కెనపు నిందన్॥

(నిష్క్రమించును)

(ఇది ప్రథమాంకము.)

శ్రీ

# రామకుమారాభ్యుదయము.

## ద్వితీయాంకము

(రామాంతఃపురము) సీతపర్యంకమునఁ బరుండియుండును,
రాముఁడుప్రవేశింపఁగా సీత లేచును.

రాము—సీతా! పండుకొనుము. చేతకానియప్పుడీమర్యాద లేల? నేను మన్నింతును లెమ్ము. గర్భిణులకు బలముతక్కువై యుండును. లేనిశ్రమమును దీసికొనఁగూడదు.

సీత—ప్రాణేశ్వరా! మీతో మాటలాడునంతవఱకు గూర్చునలేనా?

రాము—నీ సహజగంభీరతచే నట్లనుచున్నావు. ఇంతకే యెంతనిట్టూర్పువిడుచుచున్నావో చూడుము. అదియేమి నీచేతనుండునది?

సీత—ఏమియును లేదు. (అని కరమునుదాఁచును.)

రాము—దాఁచెదవేల? చూతమిటు తెమ్ము. (అని చేతినిఁచూచి) జానకీ! ఈమంటియుండ యేల? తినుటకా? చూలాండ్రకు మన్నుదిను బుద్ధి పొడమునని చెప్పుదురు. ఇపుడునాకు నిదర్శనము కాన్పించుచున్నది.

క॥ భూతనయ వగుటచేతన్
సీతల్లి యెడం దనర్చు నెనరుంజూపన్

హేతువెగా, లేకుండిన
నేతీరున మన్నురుచ్య మింతిరొనీకుఁ॥

సీత—మీ రేమైనను హాస్యమొనర్పుడు. నాకు మంటియందుఁ జవి కా న్పించుచున్నది.

రాము—కానిమ్ము, విశేషముగా భక్షింపకుము. నానావిధ మధురఫల రసాస్వాదనము చేయు నీవు మృద్భక్షణ మంగీకరించుటఁ జూచి వ్యసనపడుచున్నవో యన్న చందమున నీచెక్కిళులెట్లు వెల్లబాఱి నవో చూడుము.

సీత—నాథా! ఈవర్ణనచాతుర్య మీమధ్య నెన్నఁడు నేర్చితిరి?

రాము—ఆహా! మధ్యమనఁగా మఱియొకటి తోఁచుచున్నది.

క. పోఁడఁగానక యెచ్చటనో
యడఁగిన నిరుపేద భాగ్య మబ్బినపిదపన్
బొడసూపు కరణి నీ నె
న్నడుమిప్పుడు దొడ్డదై కనంబడె నతివా॥

సీత— దేవా! ఈవర్ణనములతో నేమికాని, మీరు సుగ్రీవాదులను హనుమంతునిఁ బంపిననాటనుండి నాకుఁ జింతపాయకున్నది. వారిని భరింపలేకపోయితిరే? అట్టి మహోపకారుల నెన్నఁడు మరలఁ జూడఁగలను.

రాము— దేవీ! ఏమిచేయనగును. ఆఘనులతో మనకిఁకఁ గార్యములు లేవు. వారి రాజ్యములవిడచి మనయొద్దనేయుంట పాడికాదు. సంతోషముగాఁ బంపితిని. నీవును నీచింతబెట్టుకొనకుము. నీవు వ్యసనపడఁదగిన సమయముకాదు. సరససఖీసోదరీజనసల్లాప సాంగత్యములనేమి, నిజప్రేమపరిపోషితశుకశారికాది శకుంతసంతానసంతోషసంభాషణములనేమి, మనోహరప్రమదావనాంతరవిహారంబులనేమి, బహువిధవస్త్రాభరణాద్యలంకార క్రియలనేమి, ప్రొద్దుఁబుచ్చుచుండుము. సఖీ! మఱియొకమాట. దృష్టి తగులునేమోయని చెప్పఁజాలకున్నాను

సీత—ఏమని?

రాము—నేనింతకుమును పెన్నఁడుం జూడని యద్వితీయసౌందర్య మిపుడు నీయందుఁ బొందుపడియున్నది. నేత్రానందముగా నున్నది.

సీత—ఇదియేనా? నేనెల్లప్పుడును మీకు సుందరవతిగాఁ బొడఁగట్టుట నాభాగ్యముకదా! ఇది ప్రాతదృష్టియే, క్రొత్తదికాదు.

రాము—ఒండొకమాట.

సీత—ఒండొకటి యేమి?

రాము—దృష్టి దోషమగునేమో!

సీత—హృదయేశా! ఊరక చెప్పరాదా! ఈదృష్టిదోషమనుమాట నెక్కడ నేర్చుకొంటిరి. మీకటాక్షము నాకేకాదు సకలజనులకు శుభప్రదమే కదా!

రాము—అయినఁ జెప్పెదను.

తే. గీ. ప్రాణసఖి! నీదు వేఁకటిబరువుఁ గనుల
నరయ గర్భాంతరాళంబు నందుశిశువు
లిరువురున్నారో యనుచు నాయెడఁదలంచు
చున్నవాఁడను, దృష్టికాకుండుఁగాత.

సీత—మీరేకాదు, అందఱు నట్లె యనుచున్నారు. నాకుఁగూడ భారముగా నేయున్నది.

రాము—జీవితేశ్వరీ! మూలాంధ్రదు చిత్రపదార్థముల నేమేనిఁ గోరుదురని విందును. నీ కట్టి పదార్థమేదేని తలంపున నున్న జెప్పుము. తెప్పించెదను,

ద్వి॥ ఇందుమండలమున నేవేళ వెల్లు
లంది జాఱుచునున్న యమృతరసంబొ
నందనంబందు దినదినంబుక్రొత్త
గందముల్ విసరెడు కల్పకసుమమొ
మానససరసీరమకుఁదలసొమ్ము

గానొప్పుచుండుబంగారు తామరయొ॥
ఏపారు కోర్కులనీనుచుదివిని
దీపించు నిర్జరధేనువుపాలో॥
పాలమున్నీటి పైఁబలుచఁగాఁబర్వి
మేలిపసిఁడినర్చు మిసిమిమీఁగడయొ॥

క॥ ఇమ్ముల మధురరసపదా
ర్థమ్ములొ వెలలేనియంబరమ్ములొ జాళ్వా
సొమ్ములొ గానమ్ములొ నృ
త్యమ్ములొ, యెద్దానిఁగోరెదవు, తెల్పఁగదే॥

సీత—ప్రాణప్రియా! మీరు నుడివినవానికంటె నెక్కువరుచిగల మీ మక్కువను సంపూర్ణముగాఁ గలిగినదాననగుటచే నట్టివేమియు నాకువలదు. మఱియొక యిష్టమున్నది.

రాము—అదియేమి?

సీత—మీరుతీర్చెదనన్న విన్నవించెదను.

సీత—ప్రేయసీ! నీకోర్కెఁదీర్ప నేను సమర్థుఁడనుగానా? లేక నాకుల్లాసము కాదా? తప్పక నెరవేర్చెదను.

సీత—నిజమేకద?

రాము—సీతా! ఇంతగా నడుగవలెనా? ముమ్మాటికి నిక్కమే

సీత—భాగీరథప్రాంతముల మునిపత్నుల నొకసారి చూచిరావలెనని యభిలాష జనించినది.

రాము—చెలీ! ఇదియేమి పిచ్చినీకు? నీ కోరిక యిదియేనా? ఎట్టి దుర్ఘటమైన వస్తువును గోరెదవోయని యనుకొంటిని.

మ॥ ఫలమా! పుష్పమ! భక్ష్యమా! నలువయా! బంగారుసొమ్మా! సము
జ్జ్వలరత్నంబ! యభీష్టమిట్టిదగునే, ప్రాణేశ్వరీ! మౌని ప
త్నుల సందర్శనమున్నఁగానకు నీకందోడ్తోఁ జనంగోరితే
కలుగక లేదొకో నీకు వేసట మదిం గాంతారసంచారముల్॥

ఈ కోర్కె నీవే కోరి యున్నావా? లేక నీ గర్భగోళమందలి కందు కోరియున్నదా? వనముల నన్ని సంవత్సరములు తిరిగితిమే, ఎంగఱో మునికాంతలతో మెలగితివే, మరల నీ కేల నీ వాంఛ గలిగె?

సీత—ఏమియో, యిప్పుడీ యిష్టము పుట్టినది. ఒకనా డుండి వచ్చెదను నాముద్దు చెల్లించెదనంటిరే?

రాము—(స్వగతము) ఆహా! పొమ్మందునా! నాకు మనసురాకున్నది. తాను నాయాస పడును. వలదందునా! – గర్భవతి యిష్టము దీర్పని పాపము కలుగును. తాను నీచింతఁ బాయకుండును. ఏమి చేయనగును? పోయిరమ్మనుటయే మంచిదని తోచుచున్నది. (ప్రకాశముగా) మనోహరిణీ! నీకు శ్రమము కలుగునని చెప్పితిని. అవశ్యము రేపే పోయిరమ్ము. ఒక్క దినమే నిలిచి మఱుదినము వెడలిరావలయు సుమా!

సీత—అట్లే చేసెదను. నాథా! నిద్రవచ్చుచున్నది. (అని పండుకొని నిద్రించును.)

రాము—ఆహా! ఈ తన్వంగి కెంత శీఘ్రమున నిదురంటె? స్త్రీజనము ముందువెనుక లరయక కోర్కులఁ గోరుచుందురు. అవి కొనసాగుటయే వారికి సంతోషము. మగవారికి నద్దానఁ గలుగు బాధల నూహింపరు. ఏమి! ఈదిన మింకను భద్రుఁడు రాలేదు. ఆహా! నా వామనేత్ర మేలకో యదరుచున్నది. భద్రునినుండి యే దయిన కష్టవార్త విన గలుగుదునే.

ప్ర॥ భద్రుడు.

మాలిని॥ జయజయరఘునాథా ! జానకీ ప్రాణనాథా ।
జయరవికులదీపా ! శాంతి సత్యస్వరూపా ।
జయరవిశతతేజా ! సర్వరాజాధి రాజా ।
జయనిజజనరక్షా ! చారుకంజాయతాక్షా ॥

(అని నమస్కరించును)

రాము—నేఁడేల జాగుఁజేసితివి ?

భద్రు—లేదు, వేళకుసరిగా వచ్చినాను; దేవరవారు దేవేరితో నేకాంతమునసుండినందున వెలుపలఁగాచుకొని యుంటి.

రాము—పట్టణమునందలి వార్తలేమి ? గూఢచారులు తిరుగుచున్నారా ? నీవును గమనించుచున్నావా ?

భద్రు—చిత్తము, గూఢచారులు కడుజాగరూకులై తిరుగుచున్నారు. జనులెల్లయెడల దేవరకీర్తినిఁ గొనియాడుచున్నారు పావనచరిత్రమును బలుమాఱులు చెప్పుకొనుచున్నారు. ఏలినవాని దయారసమును వేనోళ్లఁ బొగడుచున్నారు. 'రామచంద్రస్వామియే శాశ్వతముగా రాజైయుండవలెను' అని కోరుచున్నారు.

రాము—సరియే ! ఇవన్నియు దినమును వినిపించు విషయములే. ఇఁక విశేషములు లేవా ?

భద్రు—దేవా ! ఇఁక విశేషము లేమున్నవి ?

రాము—ఏమట్లు సమాధానము చెప్పుచున్నావు ? జనులన్యవిషయముల నాడుటయే లేదా ?

భద్రు—పలుసుద్దులఁ జెప్పుకొనుచుందురు. అవన్నియు—

రాము—అట్టివి నాకక్కఱలేదు. నన్నుగుఱించియు నారాజ్యమునుగూర్చియు నేమైన జరిగిన చర్చలు.

భద్రు—ప్రభూ ! అవివేకులు నీచులుపల్కిన పలుకులు పాటింపనగునవియా ?

రాము—ఆవివేచన నీ కేందుకు ? అదినాపని. వానినిఁ జెప్పకనే నాకు సమాధానముఁ జెప్పుచున్నావు. ఏవియో క్రొత్తలున్నవి. వానిని వినవలతు. సత్యముఁ బల్కుము. ఎవరిసగూర్చి ?

భద్రుడు—(స్వ)అయ్యో ! వేళకలిసివచ్చె. నేనేమి చేయుదును. దేవరా! ఇట్లునిక్కచ్చి యొనర్చిన నేనేమి చేయఁగలవాఁడ.

రాము—నేనడుగుకొలఁది నీవు మసలుచున్నావేల? ఇఁకఁ జెప్పకున్న నీకుఁ దగిన శిక్ష యొసఁగఁబడును చెప్పుము, శీఘ్రము.

భద్ర—స్వామీ! నాకునోరాడకున్నది. అసత్యమాడి బ్రదుకఁజాల. ఈవార్త నీకు విన్పించుటచే నాకేపాపము కలుగఁబోవునో తెలియదు. నీయాజ్ఞానుసారము చెప్పుచున్నాను. రావణాసురునితోఁ బదినెలలు లంకలోనుండిన సీతాదేవిని మరలఁదెచ్చుకొని మనరాజు కాపురము చేయుచున్నాఁడని యొకచో నీచులెవ్వరో భాషించుచుండిరి. నీయాజ్ఞలేనందున వారిని శిక్షింపనైతి. ఈకఠోరవార్త నిన్నరాత్రి పుట్టినది.

రాము—ఇంతియేనా?

భద్రు- నీపాదములాన నింతే.

రాము—ఇఁక నేమైన వృత్తాంతములున్నవా?

భద్రు—ఇఁక నెవ్వియు లేవు.

రాము—నీకు సెలవు.

భద్రు—చిత్తము. (నిష్క్రమణ)

రాము—సేవకా!

(సేవకుఁడు ప్రవేశించి)

సేవ—దేవరయానతి.

రాము—నీవు పోయి నాతమ్ములగు భరతలక్ష్మణ శత్రుఘ్నులను బిలిచికొని రమ్ము. నిద్రించుచున్నను నాయాజ్ఞఁదెల్పి తోడ్తెమ్ము.

సేవ—భాగ్యము! (నిష్క్రమించును)—

రాము—(స్వగతము) ఔరా! నన్నుగుఱించియు సీతనుగూర్చియు నిట్టివార్త ప్రబలియుండఁగా సుఖముగా నిద్రించుచున్నాఁడనే నాజనులు హెచ్చరికచేసి మేలొనర్చిరి. సీతయొక్కనిష్కళంకత్వమును గుఱించి ప్రపంచమున కింకను సందియము వదలలేదా! ఇట్టి నిందలువచ్చునని యెంచికదా లంకనుండి వచ్చునప్పుడే సీతచే నగ్ని

ప్రమాణము చేయించి యందఱు నిర్దోషయని దృఢీకరించిన పిమ్మటఁ దోడ్కొని వచ్చితినే! సీతాశీలమును గుఱించి తన్నుఁ జొచ్చిన యగ్నిదేవుఁడు, చూచి వచ్చిన హనుమంతుఁడు, స్వర్గవాసియైన మాతృప్రియగు దశరథమహారాజు, తక్కుంగల దేవతలు మునీంద్రులు ప్రశంసించిరే! సంతసించితినే! అట్టి పతివ్రతాతిలకమును నీయపకీర్తి యడఁగి పోకున్నదే. నాకుఁ గాఁడ నవివేకుఁడనియు స్త్రీలోలుఁడనియుఁ బేరు వచ్చెనే! ఈ యపకీర్తిని బాపుకొనవలయు. అది యట్లుండ నాప్రజక సౌఖ్యము వాటిల్లె. నాయందసంతృప్తి కలిగె. దీనినిఁ దొలఁగింప ప్రయత్నించుటయే నాధర్మము. ఆప్రయత్నము నామనోహారిణిని విడనాడుటయే. అక్కటా!—(అని నిట్టూర్పు విడిచి) అయినను మానె నాప్రజ సౌఖ్యమును, సద్ధర్మమును న[illegible]లును. అదియె నాకు మేలు. అదియే నాకు విఖ్యాతి. ఏమి! భరతాదు లింకను రాలేదు?

ప్ర॥ భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు.

గీ॥ మహిత రవికులాంబుధి చంద్ర! మానవేంద్ర!
తారకాచంద్ర! సీతా హృదయకువలయ
చంద్ర! భక్తచకోరకచంద్ర! నీకుఁ
బ్రణతులొనరింతుము వె. రఘురామచంద్ర॥

రా—తమ్ములారా! కూర్చుండుఁడు.

భర—అన్నా! ఈ రాత్రికాలమున మమ్ముఁ బిలిపించిన కారణము విన వేఁడుచున్నాము. రాజకార్యమేమైన కలిగినదియే. నీమోమున సంతాపమో చింతయో పొడఁగట్టుచున్నదేల?

లక్ష్మ—అన్నా! రాఘవేశ! అదెట్టి ఘనకార్యమైన నీక్షణముననే నెరవేర్పఁగలము. సెలవీయవలయును, నీ సంతాపమునకుఁ గారణమేమి?

శత్రు—అన్నా! రామమూర్తీ! త్రిశక్తులంబోలె నీతమ్ములుండఁగా నీవు చింతింప నేల?

రాము—తమ్ములారా! మీరు పవిత్రమైన సూర్యవంశమునఁ బుట్టిన రాజకుమారులరుకదా!

భర—ఔను. ఏల నటు లడుగుచున్నావు?

రాము—నాకు నిజమైన సోదరులరు కదా?

లక్ష్మ—అన్నా! కాదనువారెవరు? ఇదియేటి ప్రశ్న?

రాము—నామాట జవదాటరుకదా?

శత్రు—అన్నయ్యా! ఇంతకు మును పెన్నఁడైన నీయానతి మీఱి యుంటిమే? ప్రొద్దు పడమటిదెసఁ బుట్టినప్పుడు మీఱుదుమేమో తెలియదు.

రాము—మీరు కీర్తి నిచ్ఛయింతురా? సుఖము నిచ్ఛగింతురా?

భర—అన్నా! కీర్తిలేని భోగమేల? రాజ్యమైననేల? ఏల యిప్పుగిది సంబంధము లేక ప్రశ్నలు వేయుచున్నావు? విషయమర్థము కాలేదు.

లక్ష్మ—(భరతునిఁజూచి) నేఁడేదియో పెద్దబెడద పుట్టినది.

రాము—ఏదేని నిందకలిగిన యెడల మీరు భరించెదరే?

లక్ష్మ—అన్నా! మమ్ముఁ బరీక్ష సేయుచున్నావా? నిందమోసి జీవించువాఁడొక పందయేకదా! నిందమోయుటకన్నఁ బ్రాణము బాయుటొప్పు.

గీ॥ ఉర్వి సత్కీర్తిశాలి తా నుభయలోక
సౌఖ్యములఁ జెందు దేవతల్ సంతసింతు
రెసఁగ నపకీర్తిపరుఁడు తానిందునందు
దుఃఖములఁ జెంది పోవు నధోగతులకు॥

అట్టి ప్రసక్తి యిప్పుడేమికలిగె. శీఘ్రమునఁ జెప్పుము.

రాము—నాకుం గలిగిన కీర్త్యపకీర్తుల మీవిగా భావింతురా?

శత్రు—అన్నయ్యా! సర్వకాల సర్వావస్థలయందట్లు యెంచియున్నాము. నీవెంటఁ బుట్టినవారము కామే? జాగుసేయక నీమనోగతము సెలవిమ్ము.

రామ—మనము రాజ్యమేలుట యెవరిసుఖముకొఱకు?

భరతు—నిస్సందేహముగాఁ బ్రజాక్షేమముకై.

రామ—బళీ! సోదరులారా! మిము మెచ్చితిని. నేఁటిదినముమొదలు నాభార్యయగు సీతను బరిత్యజించుచున్నాను.

భర—
ల—
శ—
హరి! హరీ! (అని చెవులుమూసికొని) అన్నా! ఎందులకు! అన్నా యెందులకు?

రామ—నాప్రజకసంతృప్తి కలిగినందుకు, నేనొక్క చెడుధర్మమును బోధించిన వాఁడనగుటచేత.

భర—
ల—
శ—
అదెట్లు? అదెట్లు?

రామ—దుర్మార్గుఁడగు రావణుఁడెత్తుకొనిపోయి తనయింట నుంచుకొనియుండిన పెండ్లమును మనరాజు రాముఁడు మరలఁ దెచ్చుకొని కాపురము సేయుచున్నాఁడు అని యపవాదము సంభవించినది.

భర—
ల—
శ—
హర! హర! అక్కటా! (అనిచెవులుమూసికొందురు.)

శత్రు—రామచంద్రా! ఈ వినరాని నడి యేశత్రుశేషునిచేతఁ గల్పింపబడినదో, నాకించుక సెలవిమ్ము.

రామ—తమ్ముఁడా! యేశత్రువువలనఁగాదు. మనరాజ్యమునందే పుట్టినది. దీని నేను బాపుకొనవలతు.

భర—అన్నా! లోకులెంతటి పలుగాకులు, విగతవివేకులు, మొఱకు మూర్ఖులు, కన్నులున్న చీకులు! సీతామహాదేవియెడ నీనింద నెట్లు పుట్టించిరి?

సీ॥ మనవలెంగాక పావనమైన భూగర్భ
మున జగన్నుతముగాఁ బుట్టలేదె।
జ్ఞానిశిఖామణియైనట్టి జనకపృ
థ్వీపతి పెంచిన బిడ్డగాదె।
కానకేగెడునిన్నుఁ గాంచియేయుఁడుము గ
ణింపక నినువెన్నడింపలేదె।
తననిష్కళంకత్వ మనలంబుసాక్షిగాఁ
ద్రిజగంబులెఱుఁగంగఁ దెలుపలేదె

గీ॥ అట్టిసాధ్వీశిరోమణియైన తనర్చు
జానకీదేవి నీనింద సలిపిరెట్టి
మూర్ఖమనుజులు వారల బుద్ధిలేని
మాటఁ బాటింపనేల యోమూర్తలేంద్ర॥

రాము—అన్నా! భరతా! నీవుచెప్పినదెల్లను నిక్కమే. సీతాశీలమును గుఱించి నాకెట్టిసందేహమును లేదు. సీత నిర్దోషిణియని నామన స్సాక్షికిం దెలియును ఇఁక మూర్ఖులెవ్వరో పలికినపలుకుల గణింపనగునాయంటివి. మూర్ఖులుగాని యవివేకులుగాని నన్ను గుఱించి యాడుమాటలఁ బాటించుట నాధర్మమేకదా! ఈదుష్ట వాక్యము నారాజ్యమునం దంతయు నల్లుకొనిపోయునే! ఇంత పెద్దయపనింద నేను దిద్దుకొనక యూరక గద్దియపైఁ గూర్చుని యుండ జెల్లునా? నా రాచఱికమేల? నాకొఱకెట్టి కీర్తిని, నెట్టిపేరు, నెట్టిబిరుదమును వాంఛించువాఁడగాను. అపకీర్తిని మాత్ర సహింపజాల, పాపమును జేయఁజాల, న్యాయమును విడువజాల, నాధర్మమును విడనాడఁజాల. ఇందులకై నాప్రాణము లగాని, నాబహిఃప్రాణములగు మిమ్ముగాని, నారాజ్యవైభవ మునుగాని పరిత్యాగము సేయ సంసిద్ధుఁడను. ఇఁకసీతను విడ

చుట యొక ఘనకార్యముగాదు. మఱియొకయర్థమరయుఁడు. ఈనార్త జనులలోఁ బుట్టుటచే రాణియగు సీతయందు గౌరవము లేకపోయె. నాయెడభయభక్తు లడుగంటె. ఇఁక నారాజత్వ మెందులకు?

క॥ రాజొనరించెడు నడతయె
భూజనులకు ధర్మమగుచుఁ బొలుపారు "యథా
రాజాతథాప్రజా"యని
యీజగతిఁ బ్రసిద్ధసూక్తి నీరలు వినరే॥

కావున నాచేష్టలు, నాగుణములు నాప్రజకుధర్మములై పరిణమించు. ఇప్పుడొకచెడుధర్మమును బోధించినవాఁడ నగుచున్నాను. దీనివలనఁ బాపములు ప్రబలును.

క॥ పెంపుగ నాప్రజచేనొన
రింపఁబడునట్టి పలుదురితములు నన్నుం
ముంపవె "రాజారాష్ట్రకృ
తంపాప" మ్మనెడునుడికిఁ దార్కాణముగాన్॥

కనుక దీని నేను బాపుకొనవలయు. నా ప్రజ నెట్టినీతికప్పినను నెట్టిధర్మమును విడనాడినను నెట్టి సౌఖ్యము లేకున్నను నే నోర్వజాలను. అందులకై నా కెన్ని కడగండ్లు కలిగినను భరింపనోపుదు. నా నృపాలత నాప్రజల కొఱకేకద! మీరే చెప్పితిరే!

సీ॥ ప్రజలకు నీతుల పరిపాటిఁజూపని
పృథివీశులేను వివేకమేల।
ప్రజలసౌఖ్యంబులఁబరిగణింపని భూమి
కాంతుని పెక్కుభోగంబు లేల।
ప్రజలకై ధనముల వ్యయమొనర్పనిరాజు
నడసియుండినభూరి భాగ్యమేల।
ప్రజలకుఁ గల్గిన బాధల దొలగింపఁ
జాలని యాతేని శౌర్యమేల।

గీ॥ మఱియు, న్యాయంబువిడిచి, ధర్మమునుదోలి
తనదు ప్రజనేలు ప్రభువు నొదల నలంక
రించియుండిన పెద్దకిరీటమేల
కాల్పనే వానిరాజత్వగరిమ భరత॥

లక్ష్మ—రామచంద్రా! నీవు పలికిన దంతయు సత్యమే. రాజధర్మములన్నియు నీయందు మూర్తీభవించియున్నవి. నీప్రజాను రాగమునంగొనియాడుటకు మఱియొక జన్మమెత్తవలెను. "చంద్ర" శబ్దము నీ పేరునకే చెల్లును. ఒండొకండు చాల్పనర్హుండా? అయిన, నెవండో మతిహీనుండు కూసిన కూతకు నీవు పడరాని కష్టముంబడెదవా! సీతాతన్వంగికి వెండియుం గష్టముంగూర్చెదవా?

రా—తమ్ముడా! నీవు పొరంబడితివి. ఏసుఖమును గష్టములేకనే వచ్చునా? ఏ సుగుణమును గష్టములేకనే యనలంబింపనగునా? ఎట్టికీర్తినిం గష్టముజెందకనే సాధింపందరమా? మనము కష్టముల నొందకనే దుష్టరావణాదుల సంహరించి వచ్చి యిపుడు సుఖపడుచున్నామే? సీత నాతోడ నిడుములం గుడువకున్న పడతి మిన్నయని పేరొంది యుండెనే? హనుమంతుం డెన్నియో శ్రమల బొందకుండిన మనము బ్రదికి యుందుమే? ఈ భరతుండు నా కొఱకై తాను కష్టముల బొందకుండిన లోకమునకు భ్రాతృభక్తి యిట్టిదని వెల్లడింపంజాలెనే. ఇంక నెన్నియేని నుదాహరణములం జెప్పంగలను. కావున కష్టములే సుఖములు. కష్టములే కీర్తిప్రదములు. సకలోన్నత గుణసోపానములు. సమస్తగుణములు కష్టజీవి కలవడినట్లు సుఖసంపన్నుని కలవడవు. గర్వము, నిర్దాక్షిణ్యము, లుబ్ధత్వము, దుష్క్రియ, తుదకు నాస్తికత్వము మున్నగు దుర్గుణములు సుఖజీవి నాక్రమించును. వినయము, దాక్షిణ్యము, త్యాగము, పాపభీతి, దైవభక్తిమొదలగు సద్గుణములు కష్టజీవి నాశ్రయించును. కష్టపడువాడు సౌఖ్యమునం దేలియాడినట్లయిన తన సుగుణముల నొక్కొక్కటి వీడుచుండు. సుఖపడువాడు కష్టములకుం దిగినయెడల దన దుర్గు

ముల నొక్కొక్కటిని వ్రాయుచుందురు. హిరణ్యకశ్యప, బలి, రావణాదులు మహేంద్రునిగూడ జయించి సమస్తసుఖముల ననుభవింపలేదా? వారేమైరి? వారిని మనము భూషించుచున్నామా? ఒక్కొక్క డొకదుర్మార్గమునకు దృష్టాంతముగా నిలిచియున్నాఁడు. అదే మన పూర్వికులు రంతిదేవ, భగీరథ, మాంధాత్రాదులెన్ని యిడుములఁబడలేదు? వారినిభూషింపక విడుచుచున్నామా? ఆచంద్రార్కము యశోవంతులై వెలసియున్నారుకదా!

శత్రు—అన్నా! నీభాషణములకు మాఱుపల్కఁజాలము నీదగువాక్యామృతరస మెట్టిమూఢులఁగూడ బుద్ధిమంతుల నొనర్చుచున్నది. అయిన సీతాదేవి—

రాము—తమ్ములారా! మీరు సీతను గుఱించి చింతించునట్లున్నది. నాసహధర్మచారిణియగుటచే నా సుఖదుఃఖములఁ దా ననుభవింపవలసినదే. అందులకుఁ దానలవాటుపడియే యున్నది.

భర—అయ్యో! నావిన్నపమేమనగా—

రాము—అనుజులారా! మీరింకమాటాడఁ జెల్లదు. మీయభిప్రాయమునింతకుముందే బయలుపఱచి యున్నారు. ఈకళంకమును నేభరింపఁజాల. లక్ష్మణా! మీవదినె భాగీరథీప్రాంతములకుఁ బోయి మునిపత్నులఁ జూచివచ్చెదనని కోరియుండె. అనుజ్ఞనిచ్చియుంటిని. ఆకారణమున నాపె నొకరథముపైఁ గొనిపోయి యాగంగాతీరభూముల విడిచి రమ్ము. తప్పవలదు. నాయానసుమా! మీరింక సెలవుగైకొనుఁడు. (నిష్క్రమించును).

లక్ష్మ—హా! దైవమా!

భర—అన్నా! యెంతతెగువఁ జేసితివి? ఇన్ని దినములుగా కలిసిమెలసి నీతోఁబరమ సంతోషముగాఁ బొద్దులు పుచ్చుచుండు నీ ప్రాణేశ్వరిని, మాకు బూజార్హురాలగు వదినెను ద్యజించితివే? అయ్యో! పతివ్రతాగుణ విఖ్యాతయే! అయోనిసంభూతయే! త్రిలోకైకపూతయే! జగన్మాతయే! అట్టి సీతమ్మయందుదోషమా

రోపించితే! ఎంతటిమూఢులు! ఎంతటి పాపాత్ములు! అన్నా! అవివేకులగు లోకులు వాక్యానుకూలతల నీవు పాటించితివే! మమ్ముల బల్కనీయవైతివే! అక్కటా! రాజధర్మ మెంతచెడ్డది.

శత్రు—తల్లీ! సీతాదేవీ! మేమందఱమునింటనే సుఖముగా నుండి నిన్న డవులం దోలవలసివచ్చెనా? అన్నలారా!

ఉ॥ క్రించుదనంబుచేత నపకీర్తిని నీగతిఁగట్టవట్టియా ।
వంచకమానవాధములఁ బట్టి తనుల్ పలు తుంట్లుతుంట్లు గా ।
వించెదనాదుఖడ్గమున ఛిన్నమొనర్చెదఁ దచ్ఛిరంబులన్ ।
ద్రుంచెద వారికుత్తుకల దోషము కల్గదనుజ్ఞ నీయరే॥

అటులేకున్న,

క॥ గహనావాసమే రాముని
సహచారిణి కివ్విధము నొసట వ్రాసినయా
ద్రుహిణున్ సలోకముగ, నే ।
దహియించెద నాకనుజ్ఞ దయసేయఁదగున్॥

లక్ష్మ—అప్పా! వలదు ఘోరకృత్యము, రామాజ్ఞ లేదు, అతని యభిప్రాయముసు గాదు.

భర—అట్లు చేసిన నాతనికిఁ గోపమెత్తి మనమొగముఁలఁ జూడఁడు.

శత్రు—అకటా! ఎట్టి సంకటముప్పతిల్లె, అతనిశాసనమువలనఁ, బూర్ణ గర్భిణియై చూపఱకన్నులపండువుగా నొప్పారు నప్పాపోషిని నానిరపరాధినినిఁ గానపాలు చేయవలసివచ్చెనే? రాజధర్మమునకు మేరయే లేదా? స్వకీయదుఃఖమునుగూడ గణింపఁ గూడదా? రామభద్రా! ఈశాంతము నీరాజనీతి నెక్కడ నేర్చితివన్నా?

లక్ష్మ—అన్నలారా! ఈ కట్టిడిపనికి నన్నుఁ బుచ్చినాఁడే! నే నేమిచేయుదును? అయ్యో! నే నెట్టి కఠినకర్ముఁడను? అమ్మా! సుమిత్రా! ఎట్టి పాపగ్రహసంచారవేళ నీకఠినాత్మునిఁగాంచితివి? తొలినుండి నిటువంటి కష్టములే మాకుఁ బ్రాప్తించు

చున్నవి. అందఱము సుఖముగాఁ బుఱిఁజేరితిమి, యిఁకమానా
మానము లేదని సంతసించుచుంటిమే! ఇంతలోనే మరల నేదియో
భంగము పుట్టెనే! సీతమ్మ తేపడవిఁ జేరినతోడనే మాయమ్మ
గార్లు ముగ్గురు స్వర్గముఁజేరుదురు. హా! స్త్రీహతి!

చ॥ సుతయఁట భూమిదేవికిని, సూరిజనస్తుతుఁడౌ విదేహభూ ।
పతికిఁ గుమార్తెయంట, నృపవంద్యుఁడు పంక్తిరథాఖ్యమేదినీ
పతికిని బెద్దకోడలఁట. పావననాముఁడు రాజలోక పూ
జితుఁడగు రాముపత్నియఁట, చేరెడునంట వనం, బహో! విధీ॥

భర—లక్ష్మణా! ఇట్లు దుఃఖించిన నెట్లు? మా సంతాపము నెక్కుడ
చేయుచున్నావు. అపనిందకోర్వఁజాలక యిట్లు సాహసించి
నాఁడు. కాని యాతఁడు నిర్దయుఁడా? నీవిఁక ధైర్యమూనక
తప్పదు.

లక్ష్మ—అన్నయ్యా! ఏమి ధైర్యము? ఒక దండయాత్రకా? ఒక సం
గ్రామనిమిత్తమా? ఒక శత్రుసంహారమునకా? తల్లివలెఁ బ్రేమిం
చు మనవదినెను, నిర్దోషను, నిండు చూలాలిని, నిత్యసత్య
వ్రతను, నిరుపమపతివ్రతను, నిష్కపటమనస్కను మోసగించి
యరణ్యమునఁ ద్రోసివచ్చుటకా? నాచేతఁగాదు. శత్రుఘ్నా!
నీవు పోయివత్తువా?

శత్రు—అన్నా! నాచేత మొదలేకాదు. నేనిదివఱకు నా సీతాదేవితో
నెదుట నిలిచి మాటలాడినవాఁడఁగాను.

భర—లక్ష్మణా! అన్నగారు వానికాజ్ఞనీయలేదు. అంతయు నెఱింగియే
యాతఁడు నిన్నీకార్యమునకు నియమించినాఁడు. నీవే పోవు
టొప్పు. ప్రొద్దుపోవుచున్నది. మనసు గట్టిపఱచుకొని వేకువ
జామున నొక యరదముపై మెత్తనిలేపును దిండ్లనునిచికొని
యాతల్లినిఁ దోడ్కొని పొమ్ము. సుమంత్రుల వారిని సహితముఁ
బిలిచికొని పొమ్ము. తేపట నన్నగారిని దర్శించి మరలఁ బ్రా
ర్థించి చూచెదను. వసిష్ఠులు వారితో బోధింపించెదను. ఇఁక

జింతిల్లిన నేమి ప్రయోజనము. దైవసంకల్పము లెట్లున్నవో మన మెఱుఁగము. లెమ్ము పోదము శత్రుఘ్నా! రమ్ము. శాంతింపుము.

(నిష్క్రమింతురు.)

(తరువాతఁ బౌరులు ప్రవేశింతురు.)

(శంభుభట్టు, త్రివిక్రమాచార్యులు, 4 రు పౌరులు ప్రవేశింతురు.)

త్రివి—అయ్యో! శంభుభట్టు! ఇంతమాటకే రాఘవేంద్రుఁడు సీతాదేవి నడవికిఁ బంపెనా? అయ్యో!

౧. పౌ—ఏమి, స్వామి! తిక్కమాశార్లు! ఏమిసుద్ది? ఏమిసుద్ది?

త్రివి—మనసీతెమ్మను రామభద్రుఁ డడవికిబంపినాఁడు.

౨. పౌ—ఎందులకుస్వామి! ఎందులకు!

శంభు—మన రాజ్యములో నెవరో నీచులు "రావణాసురుఁ డెత్తికొనిపో యిన సీతమ్మను మన రాజు మరలఁదీసికొనివచ్చి సంసారము సేయు చున్నాఁడు" అని కూసినారట. ఈనిందను మోసికొనఁజాలక సీతాదేవిని విడిచిపెట్టినాఁడు. ఉదయముననే లక్ష్మణస్వామి యాతల్లి నరణ్యమునకుఁ దోలుకొని పోయెనట.

౩. పౌ—రామ! రామ! ఎవరానీశపుమాసులు వాల్లను సీలి స్తేబాగున్నె

౪. పౌ—అయ్యయ్యో! ఎంతదురమారగము ముండాకొడుకులబ్బా! ఆలుమొగుండ్లు కెడబాపిరే!

౧. పౌ—సిల్లరనాకొడుకులు ఊరికేవుండేది లేదు సూడు. ఏవోతప్పుడు గూతలు కూసుకుంటా వుండేది. అవియాడదంక యెక్కతాయో తెల్సుకునేది లే.

౨. పౌ—ఏమిఅన్యాయం సేసిరప్పా! కాదు శంభుభట్లుస్వామీ, ఒగేల పనికిమాలిన పలవనాయాళ్ళు యియెకంలేక వదిరిపో, యింత రాజ్యమేలే ఆయప్ప యేశనసేయ పనిల్యా.

శంభు—ప్రభువాలోచన సేయకున్నాఁడా? కడు యోజించియే పావనమై నక్షత్రియవంశమునఁ బుట్టినవాఁడుకావున నపకీర్తి బాపుకొనుట కిటు చేసినాఁడు.

3. పౌ—ఓరినీయపకీంతికాల. బంగారట్లా పెండ్లాన్ని, అగ్గిలోపరమాణం చేసిన ఆమెను యిడసిపెట్టినాఁడే? ఎంతతెగవ జేసినాడబ్బా! అదేమి గాశారమో, మాసీతమ్మతల్లి యెప్పటికి అడివిపాలే. మే మెప్పటికి తల్లిలేనిపిల్లలమే.

త్రివి—తానురాజగుటచేతఁ దనప్రజ నీతిఁదప్పి చెడిపోవునని తలంపున నిట్టిసాహసమును జేసినాఁడు. ఇట్టిధీరుడగు మహారాజేంద్రుఁడైన నుండునా?

౪. పౌ—ఏమిసాసమయ్యా? నిందుయాకటి మనిసంటే నే సీతమ్మవారు. ఎంతగట్టిమనసు సేసిండాడు ఎర్రివాఁడు!

త్రివి—శంభుఁడు! భరతలక్ష్మణ శత్రుఘ్నులైనను సమాధానముఁ జెప్ప రైరికాఁబోలు.

శంభు—ఏమియో? వారికవధి నిచ్చినాడో లేదో. లేకున్నఁ జెప్పకుండు వారా?

౧. పౌ—సెప్పకుండా వుండేరేమిసామి? ఆయనవుత్తర్వు మీ రేవాళ్లు కారు. సెప్పినపని సేసిండారు. కోపంతో సూసెనంటె యెవ డెదుటాగ నిల్చుని.

౨. పౌ—మామా! ఏమన్నాగాని, మనము వూరందరము కలిచిపోయి రామస్వామి పాదాలమీదబడి యేడుకుందాం. నరకనీ సంపనీ సీతమ్మనుపిలిపిచ్చేవరకు లేసెల్లేదందాం. ఆతప్పుడు నాయాళ్లను బడదెప్పించికైదు చేయమందాం. ఒగేలవినకపోతేఊరంతా సీతమ్మవారితావుకే పోతాంనీవాకఁ జేవుర్లో గట్టిగావుండమని సెప్పుదాం తల్లిసాటకే పిల్లలు.

త్రివి—మంచిమాట, ప్రజలందఱుపోయి విన్నవించుకొనవలెను.

3. పౌ—పాండి, మీరేముందుపాండి. మీయట్లా పెద్దోల్లు ముందుండండి.

శంభు—రండు పోదము. (నిష్క్రమింతురు.)

(ఇది ద్వితీయాంకము.)

# రామకుమారాభ్యుదయము.

## తృతీయాంకము.

(అరణ్యప్రదేశము, గంగాతీరభూమి.)

సీత—లక్ష్మణుఁడు.

సీత—అన్నా! లక్ష్మణా! మనము పట్టణమునుండి బయలుదేఱినది మొదలు నీ మోముదమ్మి చెన్నుదొఱఁగి యున్నదేల? ఖిన్నత బొడసూపుచున్న దెందులకు? పురిదాఁటి వచ్చినప్పటినుండి యొకమాటయైన మాటాడవేల? సుమంత్రుఁడు సహితము మౌనము వహించియుండు టెందులకు? అతని ముఖాంబుజమునఁగూడ వికాసము లేకుండె. త్రోవలో దుశ్శకునములు సంభవింపగా నే నెంత ప్రశ్నించినను బదులు పల్కవైతివి. మూఁగవలె వేగముగా రథమును దోల్కొని వచ్చితివి. ఈ మనోహరభాగీరథీ తీరములకు సంతోషార్థము నేను వచ్చితినే నీకా సంతసము లేదేల?

ఉ॥ మున్ను దశాసనాద్యసుర ముఖ్యులతోఁ సమరంబు సేయుచో
నెన్నఁ జతుర్దశాబ్దముల, నిద్ధవనంబుల సంచరించుచో
ఖిన్నతలేని నీ విపుడు కీడ్పడియున్న తెఱంగదేమియో
యున్నది యున్నచందమున నొప్పుగఁ జెప్పఁగదన్న! లక్ష్మణా॥

అన్నా! నేనడుగు కొలఁది నీ పూరక కన్నీరు నించుచున్నావేల? నీయశ్రుధారల నే నిదివఱ కెన్నఁడును చూడలేదే. నా కేమియో దిగు

లగుచున్నది? కడుపున బిసికినట్లున్నయది. ఈదుఃఖకారణమేమి? త్వరగాఁ జెప్పుమా?

ఉ॥ క్షేమమె జీవితేశునకు? క్షేమమె నా ముగురత్తగార్లకున్
సేమమె సోదరీతతికి? సేమమె నాదు సఖీజనాళికిన్
సేమమె యెల్ల పౌరులకు? శీఘ్రము చెప్పుము దుఃఖకారణం
బేమియొ, వీట నెవ్వరికి నెట్టి దొసంగు వొసంగె లక్ష్మణా॥

లక్ష్మ—అమ్మా! ఏమని వచింతును ఎల్లవారికిని క్షేమమె. నీకుమాత్రము లేదయ్యె.

సీత—అదేటికి లక్ష్మణా!

ల—అమ్మా! నేఁబాపకర్ముఁడ. ఈ కఠినవార్త నీ కెట్లు విన్పింతు? నన్ను శపింపుము. శ్రీరాముఁడు నిన్ను విడనాడె. ఈ యడవిని విడచిరమ్మని యాజ్ఞనిచ్చి యున్నాఁడు.

(అని కన్నీరు నించును)

సీత—హా! ఏమంటివి. నా విభుఁడు నన్ను విడనాడెనా! ఇతరులనా! నీవు చెప్పుటలోఁ బొరబడుచున్నావా? లేక యితని యాజ్ఞ వినుట యందుఁ బొరఁబడితివా! దృఢముగాఁ జెప్పుము.

ల—తల్లీ! ఇందెవ్వరి పొరపాటును లేదు. నీ పాదములాన నిక్కముగా నిన్నుఁ ద్యజించినాఁడు.

సీత—సౌమిత్రీ! ఎందుకన్నా? (గద్గదస్వరమున)

లక్ష్మ—ఈ హేతువు నేనేమని చెప్పుదును. ఇట్లు చెప్పుమని యతని యాజ్ఞ లేదయ్యె. నిజము నీకుఁ జెప్పక యీ వ్యసనమునకుం దోడుగా సందేహాంబుధిలో నిను ముంచి పోవఁజాల "రావణుఁడెత్తుకొనిపోయి పదినెలలు తన యింట నుంచుకొని యుండిన 'సీతమ్మను మన రాజు మరలఁ దెచ్చుకొని కాపురము చేయుచున్నాఁడు" అని మన రాజ్యమునం దపవాదము కలిగినందున దానినిభరింపఁజాలక నిన్నుఁ ద్యజించినాఁడు. నన్నీకార్యమునకుఁ బంపినాఁడు. ఇదిగో నన్ను శపింపుము. (అని కాళ్ళపైఁ బడును)

సీత—హా! లక్ష్మణా! (అని క్రిందపడును)

లక్ష్మ—అకటా! నేనిప్పుడేమి సేయుదును? ఈకఠినవార్త నేలచెప్పితిని? ఈసుకుమారశరీరిణిమూర్ఛనెందె. నేనుముట్టుటకుపీలులేదయ్యో ఇక్కడ స్త్రీజనము నెక్కడతేవలయు? ఎంతసేపటికిఁ దెలివొందు నోకదా! ఈరీతి నింక నెన్నిసారులు పరితపింప నున్నదియో యీ గహనమున? దైవమా? ఏమిగతి?తల్లీ! నీకెంతపాటువచ్చె' భగవంతా! ఈమెకుశీఘ్రముగఁ దెలివి కలుగనిమ్ము! (అనివస్త్రమున విసరుచుండును.)

సీత—(కొంతసేపునకు లేచి) లక్ష్మణా! నా మనోనాయకుఁడు సత్యముగా నన్నెడఁబాసెనా? నేను గలనైన నెంచియుండలేదే? ఎంత సాహసించెను? ఎంత కాఠిన్యము వహించెను' ఈజనాపవాద మెట్లుకలిగె? అయ్యో జనులకెంత బుద్ధిలేదు? నన్నెఱుఁగరైరే నేనొనర్చిన యగ్నిప్రవేశ మగ్గిలోనేపడపోయెనే? సమస్త దేవతలు, ఋషీంద్రులు నానిర్దోషిత్వమునుగుఱించి పల్కినపల్కులు వ్యర్థమయ్యెనే? అకటా' ఆ పాడు రావణాసురుఁడు నాకొఱకే పుట్టియుండెనా? వాఁడుచచ్చియు నాకుఁ గడగండ్లు తప్పకపోయెనే? అయ్యో నాపాపవిధీ! లోకులు తెలివిలేక వాగొను మాటల సార్వభౌముఁడగు తాను పాటించెనా? వివేచింపకపోయెనా? మీయట్టివారు చెప్పరైతిరే?

లక్ష్మ—తల్లీ! మమ్ము నోరెత్త నీయలేదు.

సీత—దుష్టదానవులపైఁ బూను కోపము నేఁడు నాపైననే పాఱెనా ?

లక్ష్మ—అమ్మా! ఆతనికి నియెడ నిసుమంతయు నలుకలేదు.

సీత—ఏమయిననుగాని, నాకింక నెవరుదిక్కు? ఎన్నికష్టములు సంభవించినను దానున్నాఁడని నాకెంత మాత్రమును దిగులు లేకుండెను. నేఁడు తానె నాకు లేఁడయ్యె. నేనింక నెందుఁబోవుదు, లక్ష్మణా? తనయాశచే నింతకు మునుపు వియోగదుఃఖమును భరించి జీవించితిని. ఇఁకముందు నేబ్రదుకు నుపాయమేది? ఈగంగయే నాకింకశరణము."చంద్రుఁడు తనచంద్రిక బాసినను ప్రభాకరుఁడు తనప్రభఁ దొలంగినను సీతా నిన్ను విడుచువాఁడ

గా" నని వనవిహారసమయమునఁ బల్కియుండె. అట్టిప్రేమైక చిత్తుఁడు, నట్టి వెన్నమనసువాఁడు, నట్టినాప్రాణవల్లభుఁడీనాఁ డెట్లు నన్నుఁ బాఱఁదోలె? వనవిహారకాలమున నశోకవృక్ష మునుగూర్చి మాటలాడుచో "నాథా! నిన్ను మరల నొకవేళఁ బాసిన యెడల" అని యమంగళవాక్కు నాడితిని. "బుద్ధిః కర్మాను సారిణీ" యన్నటు లిట్టి పునర్వియోగదుఃఖానలమునఁ గ్రాగుట ప్రాప్తించియే కదా నాకట్టి చెడుమాట నోటవాటిల్లె. అది యెటు తప్పును? ఋషిపత్నులఁ జూచి వచ్చెదనని కోరఁగ "సీతా! యీగర్భభారమున నెట్లు పోయెదవు ఇదియేమి కోర్కి" అని మక్కువతో బల్కలేదా? అట్టి ప్రియంకరుడిట్టి తెగువచేసెనా? మునిపత్నులడుగునపుడు నానాథుఁడు నిర్దయుఁడని యెప్పగిదిఁ జెప్పుదును ఒకయల్పమగు కాకి నను సోఁకి బాధించిన కారణ మునలోకముల నెందుఁ బాఱినను విడువక దానియసువుల హరింప నొక యద్భుతాస్త్రమును బ్రయోగించిన మత్ప్రియవల్లభుఁ డగు రఘువల్లభుఁడు నన్నుఁ బాసెనా? ఎడఁబాసెనా? నిక్క ముగా నడవులఁ ద్రోసెనా? గట్టిమనసు చేసెనా? నాయందలి మనంబునుఁ ద్రెంచెనా! ప్రేమలతను ఛేదించెనా? సత్యముగా నను బరిత్యజించెనా? ఆహా! కాలమహిమ! అకటా! పాపివిధీ! (అని మూర్ఛిల్లును.)

లక్ష్మ—ఆహా! ఈమెకు మరల మూర్ఛజనించె నే నేమి చేయఁగలను? గడచిన చర్యల నన్నిటిని తలఁచి శోకాంబుధిలో మునిఁగి పోవు చున్నది. ఈ దుఃఖమునేఁ జూడఁజాల! హా! రామభద్రా! ఎంత చేసితివన్నా? నీవే యిచటికి వచ్చియుండిన నేమగుచుంటివో? ఈభాగము నన్ననుభవింపఁ జేసితివే! అయ్యో! రామ! నీసహ చారిణియే! పూర్ణగర్భిణియే! ఎట్టి కట్టడితనమూనితివి! నీకరు ణానిధిత్వ మెక్కడఁ బోయె?

సీత—(తెలివొంది) లక్ష్మణా! ఎవరు కట్టడితన మూనినవారు? నా హృదయేశ్వరుఁడా? ఆమహామహుని నీవు దూషించితివా?

లక్ష్మ—తల్లీ! కాదు. శోకాతిరేకమున నేమియో యంటిని. క్షమింపుము. (చేతుల జోడించును).

సీత—సౌమిత్రీ! నీవు తమ్ముఁడవైన మాత్రమున నానాథుని దూఱెదవా? వలదు. అతఁడు తప్పేమి యొనర్చె. నింద బొందఁ జాలక నన్ను దూరము చేసియున్నాఁడు. తన ప్రజాక్షేమమునకై నన్ను దూరము చేసి యున్నాఁడు. నాయందలి ప్రియమును దూరము చేసి యుండఁడు. నాయెడఁ గారుణ్యమును వదలి యుండఁడు. నాస్నేహమును మఱచి యుండఁడు. దుఃఖాతిశయమున నేను నేమియో యంటిని. ఆవిభుఁడు, నామనోవిభుఁడు లోకైకధీమంతుఁడే! పాడిగాని పనిఁజేయు వాఁడు కాఁడు. సుగుణాభిరాముఁడై, స్వప్రజాభిరాముఁడై, నృపసార్వభౌముఁడై యిట్టి నీచతరాపవాదము నోర్వఁగలఁడా? ఎట్టి సతినైన విడువ వలసినదే. సీతయొక్క పూర్వార్జిత దుష్కర్మఫలము కాని శ్రీరాముఁ డేమిచేసె? ఆయన యీ యపవాదమును బాటింపకున్నఁ బ్రజానురాగమును గోల్పోయి, వారి పాపములకుఁ దాను గుదురగును. నే నీసడిని లక్ష్యము సేయకున్న సర్వనారీసమూహమున నొక చెడు ధర్మమునకు దృష్టాంతముగా నిలుచు చున్నాను. అక్కటా! దీనిని భరింపఁ గలనా?" పంకించిచూడ నీయపనింద నాకే కలిగినది. ఆయనఘునకుఁ గాదు. ఇట్టి తిట్టు నాతలపైఁ బెట్టుకొని యాపవిమలశీలునితో సుఖించు చుందునా? ఎన్నికష్టములనైన ననుభవింతునుగాక! నాపాతివ్రత్యము చతుస్సముద్ర ముద్రిత భూమండల భరణ ధురీణుండగు తన యంతరాత్మ యెఱుంగు, సర్వాపరిశుద్ధవస్తు సమూహ శుచీకరణ ధురంధరుండగు వైశ్వానరుండెఱుంగు, జగదంతర్యామి యగు భగవంతుం డెఱుంగును. అయిన నాశీల మింకను నీజగము చక్కఁగాఁ దెలియునంత వఱకు నే నామహితాత్ము చరణదర్శనము సేయ సిగ్గు చెంది యుందు. అన్నా! నీవిఁక నూరికిఁ బొమ్ము. ఈయరణ్యమునకు నీగంగకును నాకును దప్పదు.

లక్ష్మ—తల్లీ! అటు సేయకుము. నిన్నుఁ బ్రార్థింతును.

సీత—నాయనా! గంగానదిలోఁ దూఁకెదననుకొంటివే? నా ప్రాణేశ్వరున కింకను జెడ్డపేరు ఘటించిన దాన నగుట చేతను, నతని పవిత్ర వంశమును ఖేదింపించిన దాననగుట చేతను నట్టిసాహసమును గావింపను. అంతటి యవివేకురాలను గాను. ఇట్లు యీ మొదల నెంతకాలము ప్రాణములుండ విధింపఁ బడియున్నవో యంతవఱకు నీయడవులఁ బడియుండెదనని నా నాథునికిఁ జెప్పుము. కష్టముల కలవాటుపడిన దాననుము. మఱియు,

సీ॥ అపనిందగాదిది యాత్మీయధర్మముఁ
గాపాడ సూచన కలిగె ననుము
తన ప్రజసేరీతి ననయంబుఁ గడుధర్మ
బుద్ధితోఁ గరుణతోఁ బ్రోవుమనుము
ధర్మాత్ముఁడైన భూతలనాయకుండిందు
నందుఁ బేరొంది చెన్నొందు ననుము
నాకష్టములకుఁ దాశోకింపఁబని లేదు
తనయాజ్ఞ ముదమున దాల్తుననుము
గీ॥ నాదు గుణము తాను దెలిసినదె యనుము
తనదు పదచింతనంబేను దప్పననుము
మేని వెతలకు వగవను జానపముల
వలనఁబుట్టిన రట్టకు వగతు ననుము॥

(చెఱగుచే ముఖము గప్పుకొనును).

లక్ష్మ—(దీనవదనమున) తల్లీ! ఆ ధార్మికునకుఁ దగిన ధర్మస్వరూపిణివై, యా సత్యసంధునకుఁ దగిన సత్యశీలవై, యా మహారాజునకుఁ దగిన మహారాజ్ఞివై, యా పురుషరత్నమునకుం దగిన సతీరత్నమవై జగమునఁ గొనియాడఁ బడుచున్నావు. సమస్త స్త్రీ ధర్మములు నీ రూపమున నీ భూమియం దుద్భవించినవి నేఁ జెప్ప వలసిన దేమున్నది? నీ యొక్కొక్క మాట సుధాతరంగమువలె నా శ్రవణముల సోఁకుచున్నను నగ్నికణమువలె నా హృ

దయమును దపింపఁజేయు చున్నది. అమ్మా! నాకిఁక సెలవా? ఇదే యీకటికినాత్ముఁడు నమస్కరించు చున్నాఁడు. (కన్నీరు నించును).

సీత—అన్నా! పోయిరమ్ము. నీకుశుభమగుఁగాక! కౌసల్యా దేవిని మిక్కిలి యూఱడించుము. సుమిత్రా కైకేయి దేవేరులకు నానమస్కృతులు చెప్పుము. నాచెల్లెండ్రతో ఋణానుబంధములు దైవసంకల్పితములని ప్రబోధించి నన్నుమఱచు లాగునఁ గౌసల్య యత్తగారికి సేవచేయుచుండుఁ డనుము. సాధురక్షణ కుశలుండగు హరికృపాలవముచే నేను బుత్రోత్సవముఁ బొందెదను. తాను జూచి సంతోషింపఁ జాలమికి నెంతయు జింతిల్లెదనని నాజీవితేశ్వరునికిఁ గడమాటగాఁ జెప్పుము.

లక్ష్మ—హా! జననీ! (అని కన్నీరువిడుచుచు) నీమాట లన్నియుఁ జెప్పెదను. నిన్నొంటిరిగా నీవిపినమున నెవ్వఁడువున విడిచిపోదు? అక్కటా! పోవకతప్పదే!

క॥ ఓవన దేవతలారా
యోవాసరపతిముఖ గ్రహతారాగ్రములారా
యోవిధిహరిహరులారా
ప్రోవరె శ్రీరాము పత్నిఁ బుణ్యముఁగనరే॥ (నిష్క్ర).

సీత—(స్వ) హారామా! (అని నిట్టూర్పు విడిచి) లక్ష్మణా! పోయితివే! నన్నొకతనే విడిచిపోతివే!

శా॥ ఆనాఁడొక్క మృగంబు వెంటఁబడి నాయాత్మేశుఁడేగంగఁద
ద్దీనారావమొకండు విన్చునినుఁ దీవ్రంబుఁ బొమ్మన్నన
క్కానన్ నన్విడనాఁడ కెంతొ దయ నన్గాపాడు సద్బుద్ధి, నీ
కీనాఁ డేవనినన్ను వీడఁగ మనం బెట్లొప్పెనో లక్ష్మణా॥

అయ్యో! నీవేమి చేయుదువు? ఆ దినమును మీయన్న యానతియే, యీదినమును మీయన్న యాజ్ఞయే. నాకొఱకెంత దుఃఖించుచున్నావు! స్త్రీజనమునకు నీయట్టి మఱఁది పురుషులకు

నీయట్టి తమ్ముఁడీ భూమియందు గలఁడా? అక్కటా! ఈయర
ణ్యంబున నాకింక నెవరు దిక్కు?

సీ॥ గగనోన్నతంబులై క్రాలుచు నున్న సా
లంబులార? మహాచలంబులార
చీఁకట్లచే భీతిఁజెందించునో నికుం
జంబులార! గుహా వ్రజంబులార।
భీషణధ్వనులచే వెఱపించు వన్యమృ
గంబులారా! విహంగంబులార ।
యడుగుపెట్టిన నొప్పిగంటఁజేసెడు కంట
కంబులారా! కీటకంబులార ।
గీ॥ మీరె తల్లిదండ్రులటంచు మీఁద నాకు ।
మీరె యత్తలు సోదరుల్ మీరె సఖులు ।
మీరె మఱదులు చుట్టాలు మీరె ప్రజలు ।
కానఁ గాపాడరే! దిక్కులేని నన్ను॥

హా! రామచంద్ర! దశరథరాజకుమారా! కౌసల్యా గర్భాబ్ధి సుధాకరా! అయోధ్యాపురకమల ప్రభాకరా! ఖండితాఖిలదుష్టదనుజ వీరా! సకలమానిమందార! సంతతసత్యవిచార! సీతామనోహరా! నీనగుమోమునిఁకఁ జూచుభాగ్యము నాకు లేదయ్యెఁగదా! తొలిజన్మమున నెట్టి యాలుమగల నెడఁబాయఁ జేసియుంటినో యాఫలమును గుడువకతప్పునా! మునిపత్నుల జూడవలెనని కోరినందులకు వారుండు నరణ్యము ప్రాప్తించెను. ఈచెట్లు నీగుట్టలే నాకిఁక మునిభార్యలు హా! దైవమా! నాయట్టి కష్టజీవిని యెందైనగలదా! నాయన! జనకమహీశా నన్నుఁబెంచి పెద్దజేసినందులకు లేని దుఃఖమ్మును సంపాదించికొంటివి. కౌసల్యాదేవీ! నీకెప్పటికిని గోడలులేని సంకటమే! నా ముద్దు సోదరులారా! నాప్రియసఖులారా! ఇఁకమీరెవ్వరో నే నెవ్వతెనో! నన్నిఁక మఱచిపోండు హా! మనోనాథ! అనాథనాథ! రఘునాథ! అయ్యో! రావణాధమా! అకటా! లోకాపవాదమా! అబ్బా! అరణ్యమా! అహా! గర్భమా! అయ్యో. జానకీ! (అని మూర్ఛిల్లును.)

ప్ర—శ్రీవత్సుఁడు, మృత్యుంజయుఁడు హృషీకేశుఁడు
(మునికుమారులు.)

శ్రీవ—మృత్యుంజయా! పువ్వులిఁకఁ జాలును సమిధలనుమాత్రము సేకరించుకొని పోదము. ఈప్రాంత్యములఁ జూతము.

మృత్యు—హృషీకేశుఁడు దండిగఁ గొనివచ్చినాఁడు. అవి చాలవా, చూతుము.

హృషీ—శ్రీవత్సా! నీకెంత యాశరా! యీ సమిధలను చూచెనా; మన వాల్మీకితాత మిక్కిలి సంతసించును. కావలెనన్న జెప్పు దొరకవా? నీయిష్టము. ఇంకను బ్రోగుసేయుము, నాచేతఁగాదు.

మృత్యుం—ఓరీ! శ్రీవత్సా! అటుచూడుము. అజ్జచెట్టునొద్ద నెవ్వరో పరుండియున్నారు. స్త్రీవలెనున్నది.

హృషీ—ఔను, ఎవరో, సమీపమునకుఁ బోయి చూతముఁరండు.

శ్రీ—ఏమియో! దయ్యమో! భూతమో!

మృ—పట్టపగలేని దయ్యమునా! అటులయిన మనయందు గాయత్రి ప్రభావము లేదా? భయమేటికి పోయి మాటలాడింతము (అని ముగ్వురు సీతను సమీపించి)

హృ—ఓరీ! ఈమె చూలాలుగాఁ గాన్పించుచున్నది. ఎవరో రాజు భార్యవలె నున్నది.

శ్రీవ—మృత్యుంజయా! పల్కరించుము.

మృ—తాళుఁడు, మిక్కిలి శ్రమమున నిద్రించుచున్నట్టున్నది. అమ్మా! అమ్మా! (అని బిగ్గరఁగాఁబిలుచును.)

సీత—ఏమే! ఇందిరా! ఊర్మిళా (అని లేచి) (మునికుమారులఁ జూచి) అయ్యా! మీ రెవరు? ఇది సాకేతమా? శ్రీరామమూర్తినన్ను బిలుచుకొని రమ్మనెనా?

మృ—అమ్మా! మీ దేయూరు? నీవన్న వారొక్కరు నిక్కడలేరు. ఇది సాకేత నగరము కాదు. గంగాతీరభూమి. వాల్మీకులవారి యా

శ్రమప్రదేశము. మే మత్రని శిష్యులము. నీకు మెలకువ గలిగినదియే?

శ్రీవ—కన్నులు దెఱచియున్నది? మెలఁకువ యైనదాయని యడిగెద వేమిరా?

సీత—నాయనా! నాకీ జన్మమున మెలఁకువ గలుగదు.

హృషీ—ఓరీ! ఈమెకు బిచ్చిపట్టినట్లున్నది. అమ్మా! నీవు పిచ్చిదానవా మంచిదానవా?

సీత—అయ్యా! మంచితనము గడచిపోయినది, తిక్కదనము ప్రాప్తించినది.

మృ—(ఓరీ! హృషీకేశా! నీ వూరకుండుము) అమ్మా! నీదేవూరము? ఎక్కడికిఁ బోవలెను? వెంట నెవరును రాలేదా? చూలాలుగాఁ గనుపించుచున్నావే?

సీత—నాయనా! నే నెక్కడికిఁ బోవుటయు లేదు. ఇక్కడనే యుండు లాగున నాజ్ఞయయినది. నా వూర మేదయిననేమి ఇప్పటికిదియే నాకుఁ గాపురము. వెంట నొక పుణ్యాత్ముఁడు వచ్చియుండెను. గుర్వాజ్ఞానుసార మతఁడు మరలి చనియె.

మృ—అదెట్టి పుణ్యాత్ముఁడబ్బా! నిన్ను విడచిపోయినయతఁడు.

శ్రీవ—అతఁడెట్టి గురువురా! ఆజ్ఞ జేసినవాఁడు

మృత్యు—అవ్వా! నీపేరేమి?

సీత—ఏదియో యొకపాడుపేరు. శోకరసములన్నియుఁ గూర్చి క్రాచి పాకంబొనర్చిన నేమి పేరగునో యదియే నాపేరు. దానిజోలి మీ కేల? నాకు దాహమగుచున్నది. ఇందెందయినఁ ద్రాఁగుటకు నీరున్నదా?

హృషీ—(ప్రక్కన) ఈమె యేదియో దుఃఖములోనున్నది. అమ్మా అదిగో! దివ్యమైన గంగానది ప్రవహించుచున్నదే! చూడలేదా!

సీత—ఔనయ్యా! మఱచితిని. నేనుబోయి దాహము తీర్చికొనెదను? మీ రికఁ బొండు.

మృ—అమ్మా! నీవు లేవజాలవేమొ, కూర్చునియుండుము. మేమెవరైనఁ బోయి జలముం దెచ్చెదము. శ్రీవత్సా! యీయర్ఘ్యపాత్రతో (అర్ధోక్తి)

సీత—నాయనా! వలదు. (స్వగ) ఔరా! సాధుగుణము పరహితబుద్ధి బ్రాహ్మణ కుమారులకుఁ బుట్టుకతోనే పుట్టుచున్నది- అయ్యా! మీ పను లింకఁ జూచికొనఁబోండు. మీకు మిక్కిలి కృతజ్ఞను. (అని లేచి పోవును)

శ్రీవ—మృత్యుంజయా! మనము త్వరగాఁ బోయి మన తాతగారితోఁ జెప్పుదము రండు. ఈమె చరిత్రము చిత్రముగా నున్నది. మన కేమియుఁ దెలియలేదు. ఈమె భాషణములు గంభీరములుగా నున్నవి. మిగుల విద్యావంతురాలుగా నున్నది.

మృత్యు—ఔను, బిరబిర పద. (నిష్క్రమింతురు)

సీత : పునఃప్రవేశము

ఆహా! ఈ గంగా జలమును గ్రోలుటచే నా కెంతయో తాప మారెను. ఈ జాహ్నవీనీరములు నాహృదయేశ్వరుని హృదయమువలె నిర్మలములై, యతని కటాక్షములవలె నమృతప్రాయములై, యతని కృపవలెఁ జల్లనయి విలసిల్లుచున్నవి హా! హృదయేశ!

సీ॥ మోహానుబంధ మబ్బురముగా నీవేళఁ
బోఁద్రెంచితివె! నాదు మోహనాంగ!
సరససంభాషణ సరణిఁ కీనాఁడు నీ
వానఁ బెట్టితె! రసికాగ్రగణ్య!
నీదయారసమింక మీఁదఁ బాఱఁగనీక
యడ్డగించితివే దయాసముద్ర!
నీమోముఁ గాంచు పున్నియము నా కిత్తఱిఁ
జాలించితివె! సుప్రసన్నవదన!
గీ॥ నీకె కాకున్న నందఱు లేకపోయి
రెందుఁ బోవుదు? నెటనుందు? నెటుచరింతు?
నెవరుదిక్కిఁక? నీకాన్పు నెట్లుగడతు?
బ్రదుకు దేభంగిఁ జెప్పవే! ప్రాణనాథ॥

(అని వ్యసనపడుచుండును.)

(ప్ర॥ వాల్మీకి, శిష్యులు,)

శ్రీవ—తాతా! అదిగో గంగయొడ్డునఁ గూర్చున్నది చూడుము.

వాల్మీకి—అమ్మా! సీతాదేవీ! నీవిఁక వ్యసనపడకుము.

సీత—మహర్షివర్యా! మీ రెవరో! యిదే యీయనాథ నమస్కరించు చున్నది. (అని నమస్కార మొనర్చును.)

వాల్మీకి—తల్లీ! నీవు వీరమాతవగుదువు లెమ్మా. నీవనాథవు కావు; ఎప్పటికిని సనాథవే.

కం॥ ఆతతసద్గుణనికరో
పేతవు, భూజాత, వఘువిభీతవు, త్రిజగ
త్ఖ్యాతవు పాతివ్రత్య
ఖ్యాతవు, నిన్నీనుతిసేయఁ గలసేత్రా॥

మఱియు నెవఁడు సత్యసంధులలోఁ బ్రథముఁడో, ధార్మికుల లో నుత్తముఁడో, సాధులలో శ్రేష్ఠుఁడో, వీరులలో నగ్రగణ్యుఁడో, యెవని పవిత్రచరిత్రమును శతకోటి విస్తరముగా నేను వ్రాసియుఁ దనివి దీఱకున్నానో, యెవని చరణకమలసేవ సంసారసాగరమును దాఁటించు నావయో, యెవనిపావననామధ్యాన మఖిలజగంబుల కమృతపానమో, యెవ్వానిప్రతాపము సకలరాక్షసగహనదహనరూపమో యట్టి శ్రీరామచంద్రుని మనఃప్రీతవు. నాతపస్సు కలిమి నంతయు నెఱిఁగితిని. నేను వాల్మీకిని. ఇది నా యాశ్రమభూమి. నాయింటికిఁ బోదమురమ్మా.

శ్రీవత్సా! నీవుపోయి మీతల్లిగారిని బిలిచికొనిరమ్మా.

(శ్రీవ॥ నిష్క్ర)

సీత—మహర్షిచంద్ర! మీరంతయు నెఱిఁగియే యున్నారు. నేఁజెప్పవలసిన దేమున్నది. నాపట్టణమును బాసి బందుగులకు వెలియై నానాథునిచేఁ బరిత్యక్తనై యిట్లరణ్యమునఁ బడియుండవలసి వచ్చినది.

వాల్మీ—అమ్మా! అట్లు తలంపకుము. ఇదియంతయు నీరాజ్యమే. నాయిల్లు జనక మహారాజు నిల్లుగా నెంచుము. నిన్ను నాపుత్రికవలెఁ బోషింతును. రామభద్రుని దూరకుము. అతఁడు దూరువడఁదగినవాఁడు కాఁడు. సార్వభౌమపదవి యందున్నవాఁడు, కానఁ దనకుంగలిగి

యపకీర్తి బొప్పుకొననిట్లు చేసినాఁడు. ఇంకను దైవికములగు కారణములున్నవి. వాని నీకుఁ జెప్పరాదు. శ్రీరాముడు నీయందు కోపమెంచియుండఁడు. నీవియోగమును గూర్చి నీవలె నతఁడును వ్యసనపడుచుండును నీవేమి నొచ్చుకొందువు. విధిసంకల్పమునకు మన మెఱుఁగనిది కాలము. ఓపికపట్టుము. కొంతకాలము గడచిన పిమ్మట నీపతినిఁ జేరుదువు. భయపడకుము. నీసేవకు మునికాంతలనప్పగించెద. నీకు సుపుత్రోదయమగును.

సీత—నాయనా! నేనునీబిడ్డను. (నమస్కరించి) నీవాక్యామృతమున నాదుఃఖానలము చల్లారెను. నీవుచెప్పినదెంతయు నిక్కము. నీయనుగ్రహమునకుఁ బాత్రనైతి. నేనుధన్యను.

ప్ర॥ చారురూప, భార్గవి, అపర్ణ.

చారు—నాయనా! ఏమియాజ్ఞ? ఈతరుణీమణి యెవరు?

వాల్మీ—

ఆ॥ వె॥ అమ్మ! ఈమెసూవె, యవనీతనూజాత
జనకరాజసుత దశరథునికోడ
లల్లరామచంద్రు నర్ధాంగ లక్ష్మియుఁ
బుణ్యగుణసమేత, పూత, సీత॥

భార్గవి—ఆహా! ఈయమ్మ సీతాదేవియా? ఏమిమాపుణ్యము!

సీత—అమ్మా! మీకు నమస్కరించుచున్నాను.

అపర్ణ—జానకీదేవీ! నీకు సమస్త శుభములగుఁగాక!

సీ॥ నీభవ్యనామంబు నిసువులకుంబెట్టి
పిలువంగదగు ముద్దుపేరుసుమ్ము

చారు—

నీగుణావళియెల్ల నెలఁతలుదిద్దంగఁ
జాలిన తొలియోనమాలుసుమ్ము

భార్గవి—

నీపతిభక్తి యేనీరజేక్షణకుఁ దర
మ్మసిధారావ్రతమ్మసుమ్ము

అపర్ణ

నీపవిత్రచరిత్ర నేల నెల్లరకును
నలువారుపారాయణమ్ముసుమ్మ

గీ॥ నీదుచక్కఁదనము నీరజాననలెల్లఁ
గనుల నద్దుకొనఁగఁ దనరుసుమ్మ
నిన్నుఁజూడఁగాను నీసేవసేయంగఁ
మాతపంబు పండె, మహిమనిండె॥

వాల్మీకి—అపర్ణాంబా! లోకాపవాదనిమిత్తమునఁ బతియానతిమై యీసాధ్వి యిచ్చటికి వచ్చినది. మీపుత్రికవలెఁ జూడనగును. పూర్ణగర్భిణిగా నున్నది. సుఖప్రసవము జేయించు భారము మీయది. పర్ణశాలకుఁ బిలుచుకొనిరండు. స్నానవేళయయినది. నేఁబోయెదను. (వాల్మీకి నిష్క్ర-)

శ్రీవ—మృత్యుంజయా! సీతాదేవిగారు వచ్చినారని మనయాశ్రమ వాసులందఱికిఁ జెప్పుదమురండు.

మృత్యుం—పోదము పద. (శ్రీ॥ మృ॥ హ్రా॥ నిష్క్రా॥)

అపర్ణ—(సీతనుచూచి) తల్లీ! నీయెడ నెట్టి లోకాపవాదము సంభవించె? ఆశ్చర్యముగానున్నది.

సీత— అమ్మా! నేనేమని చెప్పఁగొందును. లజ్జయగుచున్నది. నన్ను రావణాసురుఁడు తనలంక కెత్తికొని పోయియుండినదే యెంతటి యపనిందకును గారణముగాదా?

చారు—హా! హా! చిచ్చుఁజొచ్చి ప్రమాణముగావించి వచ్చితివని నీశీలమును గుఱించి జగమంతయు మెచ్చుచున్నదే! అట్టి పతివ్రతామణికి నెట్టి దుష్టబుద్ధులు రట్టుఁబుట్టించిరి? వారు రౌరవాది నరకంబులనెన్ని వత్సరములు విష్క్రిములఁ దినుచుఁ బడియుండనున్నారో తెలియదు.

భార్గవి—సాధ్వీమణీ! పోవనిమ్ము. ఇదియొక దైవకృతము, నీవు చింతిల్లకుము. వజ్రమును గులకఱాయి యన్న మాత్రమున నదియెన్న

టికిని గులకటాయికాదు. మహర్షి వాక్యములమదిఁజొన్పియూఱ డిల్లుము. అతని దయవలన నీపతిని మరలఁ జేరఁగలవు అంత వఱకు మమ్ములనే నీతల్లులుగాను, యక్కలుగాను, మఱియు సేవకురాండ్రుగా నెంచుము. నీవు భయపడ నవలదు.

సీత—పరమామతులారా! సతీరత్నములారా! మీసేవ నభిలషించియే నేవచ్చుట. నాయభిలాష యీడేఱె. పంపఁబడిన కారణము మాత్రము విరుద్ధమయ్యె. నా నాథు నాజ్ఞయగుటచేఁ దలఁ దాల్చితిని.

అపర్ణ—దేవీ! ఎంతయుఁ బ్రశంసనీయము. నీవిక జింతింప నక్కఱ లేదు. లేని యాయాసముం జేసి కొనకుము. నవమాసము లయిన వియే?

సీత—అమ్మా, అయినవి, యేమి సేతును?

అపర్ణ—ఏమిచేయఁగలవు. ఊరకుండుము. నీకేభయమును లేదు. దైవము ఫలమిచ్చియున్నాఁడు, కోరినను వచ్చునా? భార్గవీ! ఈమె కాళలివేళ యయినది. పోదము లెండు, చారురూప, లేవే.

చారు—సీతాదేవీ! నీవురాజు దేవేవి. దివ్యసౌధముల వసించుచుండిన దానవు, మాపర్ణకుటీరములలో నెట్లు కాపురము సేసెదవమ్మా

సీత—మీరేలాగున నున్నారో. నేనునటులనే యుందును. మీవలె నేను నొక స్త్రీనే కదా? నాయెక్కువ యేమున్నది?

భార్గవి—సంతోషము. సంతోషము. పోదము రమ్మా.

(అందఱు నిష్క్రమింతురు.)

(ఇది తృతీయాంకము.)

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# రామకుమారాభ్యుదయము.

## చతుర్థాంకము

రామునంతఃపురము — — రాముడు.

రా — (స్వ)

ఉ॥ ఎంచితివే ననుం గఠినవృత్తుఁ డటంచు మనంబునందు? భా
వించితివే ప్రశాంతమును వీడుచుఁ గ్రుద్ధుఁడనై తినంచు? శం
కించితివే ప్రియారసముఁ గ్రీడకె చూపితినంచు? లేక యా
యాసించితివే శ్రమంబులను జెంది మొడుందను గుంది? జానకీ॥

క॥ సొక్కితివే యొంటరివై
స్రుక్కితివే లక్ష్మణుండు సుద్దిని జెప్పన్
చిక్కితివే గహనంబున
దక్కితివే భయదమృగవితానముపాలన్॥

ఆ॥ వె॥ అకట లోకవినుత! యవనీ తనూజాత
వదనకాంతి విజిత పంకజాత
బంధు పారిజాత! భవ్యగుణోపేత
శ్రీసమేత, విమలచేత, సీత॥

ఆహా! లోకాపవాదం బెంతటి శోకాతిరేకంబు దెచ్చిపెట్టె. అయ్యో! మూఢజనులార! సురగణములు, ఋషిసంఘములు సీత నిష్కళంకయని చెప్పిన సాక్ష్యములు, సీత యొనర్చిన యగ్ని ప్రమాణమును మీరు నమ్మకపోతిరే! హా! మనోహరీ! నేను గఠినాత్ముఁడ, కఠినకర్ముఁడ పాపచిత్తుఁడ. నిండు చూలాలవగు నిన్ను నెండకన్నెఱుఁగని నిన్నుఁ బండు వెన్నెలబోలు మోముగల నిన్ను, నన్ను దైవముగా నెంచియున్న నిన్ను నిర్దోషవగు నిన్ను, నేనడవులఁ ద్రోసితినే! మహాపాపము జేసితినే! నీ కెట్టి సంకటముం గలుఁగ జేసితిని? రాజాధిరాజపట్టమహిషి వగు నీ కడవి కాన్పు వ్రాయఁబడి యుండెనా? అయ్యో! ఎంతదుఃఖించితివో? నన్నెంతదూఱితివోకదా? దూఱిన నేమి? నన్ను శపించిన నేమి? ఈ నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తము కలదా? చల్లిపోయిన పాలు మరల లభింపనిమాడ్కి నీ సుందరవదనారవింద మింకఁ జూచు భాగ్యము నాకు లేదాయెకదా! నేను నిన్ను విడనాడితినని లక్ష్మణుండు నీకుఁ జెప్పియుండునా? నాయానతి మేరకుఁ జెప్పకున్నను వానిలోని దుఃఖానలము ముఖపద్మమును మాడ్చియుండె. ఆ తెఱఁగు గనుఁగొని నిక్కముగాఁ గారణ మడిగియుందువు. వాఁడు నీయందు భక్తిగలవాఁడు కావున వ్యసనవశమునఁ దెలిపియుండునా? అయ్యో! అవ్వార్త కేమయితివోకదా! ఎంత దిగులొందితివో! ఎట్లు జీవించియున్నదానవో? అకటా! నేను స్త్రీహత్య గావించితిని. అందు గర్భిణీహత్య నొనర్చితిని. నాకేది పాచితము. నన్నెవరు మఱలఁ బవిత్రునిఁ జేయువారు?

హా! సీతా! జనకరాజన్యతనూజాతా! నయనవిలాసాపహసితకంజాత. మంజుళాలాపవిజితవసంతదూతా! సర్వసుగుణసంఘాతా! మదీయాశేషసంతోషహేతుభూతా! నీకును బ్రాణాపాయకరమగు నలఁజడిఁ గలుగఁజేసితిని. నేను నపారమగు వ్యసనమునుఁ దెచ్చుకొంటిని. అయ్యో: ఇఁక నెట్లు భరింతు? ఎవరిని బల్కరింతు? ఎవరిని జూచి సంతోషింతు? ఎవరితో సరససల్లాపములఁ గావింతు? ఎవరికోర్కు లీడేర్పనెంతు? ఈ వియోగము నెట్లు సహింతు? వైదేహీ! నీవులేకున్న నీరాజ్యము నాకేల? ఈ సౌఖ్యములు నాకేల? రావణునిచేఁ జెరవడి నపుడు వానిని హతమొ

వచ్చి నిన్ను గొనివత్తునను ధైర్యమున నపుడు వియోగదుఃఖమును భరించియుంటి. ఇప్పుడన్ననో నే నకారణమైతిని, ఇఁక నే నెందుబోదు. ఎవరినిఁ బ్రార్థింతును? ఎవరు నన్ను దరిఁజేర్చువారు? హా! జీవితేశ్వరీ! నాజీవరత్నమా! నా జీవధారమా! నాకింక జీవమేల? నీవు దండనుండు కాలమున దండకాటవి సయితము మనోహరోద్యానము వలెఁ బొడగట్టుచుండె. ఇప్పుడీ యయోధ్యానగరమే నాకుఁ బాడైనట్లు తోఁచుచున్నది. ప్రజలుకూడ నీయందలి భక్తి ప్రియములచే నిన్నుఁ బిలిపింపకున్న నీకడకే పోయెదమని చెప్పిపోయిరి. ఇఁక నీ పట్టణమున నాకేమిపని? నాప్రజలే యిట్లుపల్కఁగా నాతల్లివచ్చి "రామా యేలయింత సాహసము చేసితివి? సీతను డివికి బంపితివే? నాగతియేమి? అని కోపమున నడుగఁగా నేనేమిచెప్పుదును? కౌసల్యాదేవి నీశాపమునకు సత్పాత్రుఁడనై యున్నాను. నామఱఁదం ద్రోకవేళ వ్యసనాతిశయమున కెదుటివచ్చి బావా! మాయప్పను దోషయని నమ్మితివే? మమ్మునుండి యాప్రేమపూవ నెడఁబాపితివే? యని పరిపరివిధంబుల దుఃఖింపగా నేనేమోము పెట్టుకొని యుత్తర మిచ్చువాఁడ. అకటా! ఇందఱికిఁ గుందు సంధించిన వాఁడనయితిని. బంధుభేదనయితి హా! ప్రాణేశ్వరీ! నాబహిఃప్రాణమా! నేనిందుండఁ జాల నీవడవుల నిడుమలఁ గుడుచుచుండ నేనీపురమున మురువుగఁ దిరుగుజాల!

సీ॥ కటికినేల నీ వటవినిఁ బడియుండ
మృదుశయ్యలందు నిద్రింపగలనె।
యాకలములఁదిని యడలుచు నీవుండ
రసవదన్నంబుల మెసవఁగలనె।
నీవాఁటివల్కలతో నెగులొందుచుండంగఁ
గనకాంబరములనేఁ గట్టగలనె।
దిక్కులేమికి నీవు పొక్కుచునుండగా,
సంతోషగోష్ఠి నే సలుపఁగలనె।
గీ॥ అకట! సౌఖ్యములేల? మర్యాద లేల?
వైభవములేల నీరాజ్యభారమేల।

ప్రాణము లివేల? నినుబాసి బ్రదుకఁజాల !
తరుణశశిఫాల! ముకురసుందరకపోల॥

శా॥ నీ నేర్పుల్, పరిహాసముల్ సరసముల్, నెయ్యంబు, సన్మాటలున్
జానౌమాటలు, నెమ్మికూటములు, సుజ్ఞానంబు, సౌశీల్యస
న్మానంబుల్, పతిభక్తి, చక్కఁదనమున్నాడెందమున్బాయునే
యేనెట్లోర్తువియోగబాధనిఁక నేలాగు నిన్గాంతునే॥

హా! జనకావనీంద్ర! ఇట్టి సుగుణఖనియగు నీప్రియపుత్రి నీ క్రూరున కిచ్చియేల పరిణయ మొనర్చితివి? నీకు దోష మొనర్చితిని. నన్ను క్షమింపుము. నీకునా మోముఁజూపఁజాల హా! విధీ ఎన్నివిధంబులఁ గూర్చితివి? నామనస్సాక్షిగా నీజన్మమున నే పాపము నెఱుఁగనే! మున్పటి బాములనెట్టి కల్మషముల గావించియుంటినో కదా? నాకిఁక నెవరు శరణము. హా! పరమేశ్వరా! గౌరీరమణ! మహాదేవ! దుర్భరము. దుర్భరము. నేనీగృహమున నుండజాల, నీ నగరమున నిల్వజాల, నాహృదయేశ్వరి యున్న యెడకే పోయెద. (అని పోవుచుండ)

ప్ర—లక్ష్మణుఁడు

లక్ష్మ—రామరాజేంద్ర! ఇదెయీ క్రూరకర్ముఁడు నీయాజ్ఞ నెరవేర్చి వచ్చియున్నాడు (అని నమస్కరించును.)

రా—హా! లక్ష్మణా! (అని కౌగలించుకొని) లెమ్ము. మీావదినెను సత్యముగా విడిచివచ్చితివే?

లక్ష్మ—నిక్కముగా విడిచివచ్చినాను?

రాము—ఎచ్చట?

లక్ష్మ—నీవానతిచ్చిన గంగానదీ ప్రాంతమున. నీవు సత్యసంకల్పుడవు.

రాము—అయ్యో! నా సంకల్పమా! అచ్చటి నెవ్వరైన నుండిరే?

లక్ష్మ—అంతమునొక్కరైన లేరు. ఇప్పుడు సీతాదేవి యున్నది.

రా—అకటా! సీతా! అన్నా ఈ యపనింద విషయము దెల్పితివే?

లక్ష్మ—తెల్పకున్న నామెనెట్లు డించివత్తును? ఋషిపత్నుల సందర్శనము చేయించుకొని క్రమ్మరఁబిలుచుకొని రావలసినవాఁడనే కదా నీయాజ్ఞ లేకున్నను, నేనా సాధ్విని వదలివచ్చుట కుపాయాంతరము లేనందున, నాసత్యశీలను మోసగింప నాకు బుద్ధిపుట్టినందున, నపవాద వృత్తాంతమంతయుఁ దెలియఁజేసి విడిచివచ్చినాను. ఇందుకునన్ను క్షమింపవలయు.

రాము—లక్ష్మణా! నీవు వివేకశాలివి. నిన్నుక్షమింపఁ దప్పేమున్నది. మీకందఱకు వ్యసనమాపాదించితిని. మీరందఱుకలిసి నన్ను క్షమింపనగును. అయ్యో! ఆవార్తచెప్పినపుడు నాప్రాణేశ్వరి యేమయ్యెనో, యెంత చింతించెనో కదా!

లక్ష్మ—ఏమాయెనో, నీ యెదుటనుండినఁ దెలిసి యుండు నెంతదుఃఖించెనో, యెంతపలవించెనో, ఎందఱిని దలంచెనో, యెట్లు ధైర్యమువహించెనో, నన్నేరీతిపుత్తెంచెనో, నేనేగతి నేతెంచితినో నాకే తెలియదు. అప్పటిస్థితి నెట్టికవికినూహింప సాధ్యముకాదు. ఆదుఃఖమును బూర్ణముగా నన్ననుభవింపఁజేసితివే? నేనును దశరథపుత్రుఁడనే కదా! కష్టరాక్షసుడననుకొంటివే! రామా!

రామ—సౌమిత్రీ! కోపింపకుము. నన్నుమన్నించుము. నేను దీనుఁడను.

లక్ష్మ—దేవా! నీపైనిఁ గోపించునంతటి వాఁడనా? అటులేల పల్కెదవు. వ్యసనాతిశయమున నంటిఁగాని యాగ్రహముజేతఁ గాదు. నన్ను క్షమింప నమస్కరించుచున్నాను. (నమస్కరించును.)

రాము—అన్నా! లెమ్ము.

ఉ॥ ఏమనిచెప్పెనాదు హృదయేశ్వరి, యేమనివిన్నవించె, న
న్నేమనిదూరె, నెమ్మదిని నేమిదలంచె, సఖీసహోదరీ

ప్రేమము నేమిజెప్ప దనసుద్దులకత్త కేమిజెప్పునో,
నామనమూగుచున్నది వినంగ, సమస్తము దెల్పులక్ష్మణా॥

లక్ష్మ—అన్నా! పతివ్రతాతిలకము తన ప్రాణవల్లభునికే కడమాటలఁ జెప్పునో, గృహరత్నమగు కోడలు తనయత్తగారి కేమాటల జెప్పునో, విజ్ఞానవతియగు సహోదరి తనముద్దుచెల్లెండ్రకే ప్రియవచనములఁ జెప్పునో, ప్రజామనోభిరంజనియగు మహారాజ్ఞి తనజనుల కెట్టిప్రియవాక్కులు బల్కునో, యట్టివన్నియు నుడివినది భవద్వియోగదుర్భరశోకానల జ్వాలాపరంపరా పరితప్త హృదయాంబుజయై యెన్నిచందములనో వాపోవుచుఁ బలికిన వన్నియుఁ జెప్పఁజాల. ముఖ్యముగా "నీయాజ్ఞఁదలఁదాల్చితి ననియు, నీకుంగలిగిన నింద తనదేననియు, నీచరణసరసిజధ్యానము దప్పననియు, నిదేరీతి ధర్మపరిపాలనము సేయుమనియు, నీకుఁ జూచుపుణ్యము లేకున్నను నీయనుగ్రహమునఁ దనకుఁ గలుగఁబోవు, అకటా! నే వాకొనఁజాల. (అనిదుఃఖించును.)

రాము—హా! సతీమణీ! (అని మూర్ఛిల్లును.)

లక్ష్మ—అయ్యో! దైవమా! ఇది విపరీతమాయె! ఏమిచేయనగును? తానేలనన్నడిగె? నేనామాటల నెందులకువచించితి? అవివేకమొనర్చితిని. వీరుభయుల వ్యసనముల నిట్లు కన్నులారఁజూచి శోకింపనాకు విధింపఁబడియున్నదే! హా! శ్రీహరి! నేనేమిసేయుదును? తొలుతనిజధర్మహాని నోర్వఁజాలక యట్లు పరిత్యజించి యిప్పుడిప్పగిది నొప్పిఁజెందుచున్నాఁడు. అది తప్పునెట్లు? ఎట్టిధీరునికైన నునిర్దోషయగు తనప్రియపత్నిని నట్టడవిం ద్రోయ నిట్టిబెట్టిదపు సంకటము బుట్టకున్నే? ఇంకవగచిన ప్రయోజనము లేదు. ఇతనిని శాంతిబఱచుటొప్పు.—అన్నా! రామచంద్రా! (అనిమెల్లన లేపును)

రాము—(లేచి) లక్ష్మణా! ఏమంటివి?

లక్ష్మ—రఘువీర! సామాన్యజనునివలె నిట్లు దురపిల్లిన నెట్లు? ఉత్తమ క్షత్రియ వంశసంజాతుడవై సార్వభౌమపదవినున్న నీ వపకీర్తి బాయుటకొఱకు, నీ ప్రజాసంతృప్తి కొఱకుఁ బ్రాణసతియనక సీతాదేవినిబరిత్యాగముఁ జేసినదిచూడగాలోక మంతయు నిన్ను మహాధీరుఁడనియు. వివేకభూషణుఁడనియు, రాజధర్మైకనిపుణుడఁ నియుఁ గొనియాడునుగద! ఎన్నిధర్మములనో నీవేతొలుత జెప్పి తివే? వ్యసనాతిశయమున మఱచితివా? మీవియోగమున కేది యోదైవికమగు కారణముండవచ్చును, కాలగతి మనకు దాటఁ దరమా? పునస్సమాగమ మెపుడేర్పడియున్నదో యపుడు సీతా దేవినిన్నుఁ దప్పక చేరును. నీవు సకలధర్మవేత్తవు. మాబోటియ ల్లలకు బోధింపఁ గలఁవాడవు. నీకుఁ జెప్ప నేనెంతటివాఁడ. ఇఁక నీవ్యసనమును బాఱఁదోలుము. శాంతినొందుము. నీవు దుఃఖిం చుచున్న నందఱు నవ్విధంబుననే వ్యాకులత జెందియుందురు. చంద్రుఁడు మాసిన నాకసమంతయు జీకటియేకదా! కావున నూఱడిల్లుము.

రాము—అన్నా నీవాక్కు లమృతతుల్యములు. దైవచిత్ర మనిర్వాచ నీయము, కాల మవిలంఘనీయము, సుఖదుఃఖములు సమాన ములు, విధికల్పితములు, తత్సంతోష వ్యాకులములు, నిష్ప్ర యోజనములు, నిజధర్మాచరణము కర్తవ్యము.

లక్ష్మ—అదియే నే విన్నవింపబోవునది. రాజకార్యముల మాని మూడు దినములాయె. చూడవలదా? మూఁడుదినములనుండి నీదర్శనము లేక ప్రజలు మిగులఁ జింతించుచుందురు.

రాము—నిక్కమే. పోదమురమ్ము. (నిష్క్రమణ)

## రామసభాభవనము.

(రామాదులు, మంత్రి, వసిష్ఠుడు, సేవకులు)

రాము——అమాత్యవరా! కట్టిడి రక్కసుడగు లవణాసురుని గిట్టించివాని పట్టణమేలు మన శత్రుఘ్నుని దిట్టతనము కొనియాడఁ దగి యున్నది.

సుమం——రఘునాథా! నీతమ్ముఁడుకదా యతఁడు. పరాక్రమము విషయము జెప్పనేలఁ చతురాననుని చతుర్ముఖములవలె, నారాయణుని చతుర్భుజములవలె, కామధేనువు చతుస్తనంబులవలె, వాఙ్మధురిమయందేమి, పరాక్రమమునందేమి, త్యాగమునందేమి, మీర నల్వురన్నదమ్ములందఱు నొక్కటిగానే పుట్టియున్నారు ఎక్కువ తక్కువ లేదు.

భర——మంత్రివర్యా! మాయెడ మీకిట్టియభిమానమున్నందులకు మిక్కిలిసంతోషమగుచున్నది.

రాము——అమాత్యవరా! శత్రుఘ్ననికి సమాచారము పోయియున్నది. కదా?

సుమం——మొన్ననే పంపినాఁడ. ఈదినమతఁడు రావచ్చును.

వసిష్ట——రామభద్రా! యజ్ఞముసేయఁ దలఁచినానంటివే. చేయ గడంగెదవా?

రామ——అందునిమిత్తమే శత్రుఘ్ననికి వృత్తాంతము పోయియున్నది యేయనిసుమంత్రు నడిగితిని. నిజముగాఁ జేయఁబూనెదను. తమ రాజ్ఞనీయవలె. సర్వపాపక్షయకరమును,కడుధార్మికమునగు నొక దానిని సెలవీయనగును,

వసి——నీకెయ్యది యిష్టమో యద్దానిఁ గావింపవచ్చును. ఈ మాసముననే సుముహూర్త మున్నది.

రాము—తమ్ములారా! మీ రేమందురు,

లక్ష్మ—సంతోషమే! యేలకాదు.

రాము—రాజసూయయాగము చేయుదునా? మీ కిష్టమేనా?

భర—అన్నా! ఈయజ్ఞము వలదని నావిజ్ఞప్తి. ఏలయన

చ॥ అవనిని నీదు సేవకులె యందఱు రాజులు పన్నుదాకువా ।
రెవరు? విధేయగౌరవము లెంతయునొప్ప మెలంగు వారిని
గవియుట పాడియే? చదువగా మఱి న్యాయమె? కాన వా ।
స్తవముగఁ బల్కువాడ, నృపసత్తమ! మానుము రాజసూయమున్॥

ఇంతకుమున్న భార్గవరామునికోపానలంబునఁ బెక్కురాజన్యులు నీఱైరి. ఈజన్మముంబట్టి నీవు రెండవ పరశురాముఁడ వగుదువు. కాన నీరాజక్షయకరమగు రాజసూయమును మాని యైహికాముష్మికఫలప్రాపకమగు నశ్వమేధమే చేయబూనుము:

వసి—రామా! భరతుండెంతయు విమర్శించి చెప్పె. బాగున్నది. అశ్వమేధమే ప్రయత్నింపుము.

రాము—లక్ష్మణా! నీ వేమందువు?

లక్ష్మ—నిజమే. అశ్వమేధ ముభయలోకసుఖదాయకము.

ప్ర—శత్రుఘ్నుఁడు.

శత్రు—(వసిష్ఠులచూచి) గురుచంద్రమా! నమస్కరించు చున్నాను.

వశిష్ఠు—కల్యాణమస్తు.

శత్రు—గీ॥ అఖిలభూజనవినుత దయాసముద్ర ।
కష్టరాక్షససందోహ కాలరుద్ర ।
తతదిగంత విస్ఫూర్త యశోధవళముద్ర ।
ప్రణతులొనరింతునన్న శ్రీరామభద్ర॥

ప్రధానవర్య! అభివాదనములు. అగ్రజులారా! వందన మాచరించుచున్నాను.

రాము—అన్నా! లవణాంతక! నీకు శుభమగుగాక!

భర—కూర్చుండుము. ఇదేనా నీరాక?

లక్ష్మణ—నీకు సుఖమా?

శత్రు—అన్నలారా! మీయనుగ్రహమున మిక్కిలి సౌఖ్యముగానున్నాఁడను.

భర—సోదరా! లవణాసురుని సంహరించి మాకుఁ గీర్తి దెచ్చితివి. సాధుముని పుంగవులకుఁ గలుగు బాధల నివారించి పుణ్యమార్జించితివి.

శత్రు—అన్నా! ఇదియంతయు మీయాశీర్వచన మహిమ.

రాము—తమ్ముఁడా! రాక్షసహననమున లక్ష్మణునే పోలియున్నావు. ఇప్పుడు నిన్ను బిలిపించిన కతమేమన నొకకార్యము నెఱుప నెంచినాను. రాజసూయము దలపెట్ట నది రాజనాశన హేతువని భరతుఁడు మందలించినందున నశ్వమేధ మొనరింప నిర్ధరింపఁబడినది. నీయభిప్రాయ మేమి?

శత్రు—అగ్రజా! పెద్దవారగు మీ కేది యిష్టమో యదియే నాకుసమ్మతము. రాజసూయయాగము రాజులకు హానికరము నిజమే. అశ్వమేధముఁబూని గుఱ్ఱము మొగమునకు బిరుదములవరించి దేశముల విడిచిన వీరుఁడగు రాజు పట్టుకుండునా? అట్టివానిని బోరిఁగొనక విడిచెదమా?

లక్ష్మ—అట్టిదేదియుఁ బొసఁగదనియు సమస్తరాజ నికరము కప్పముల నప్పనముసేసి సమ్మానింతురనియే మనకు నమ్మకము.

రాము—(వశిష్ఠునిచూచి) గురుతిలక! నాయనుజు లందఱు నంగీకరించినారు. ఈక్రతువునకే స్థలము నేర్పాటు చేసెదరు?

వశి—నైమిశారణ్యమున గోమతీతీరము ప్రశస్తముగా నుండును. అచ్చట సమీపమగుటచే ఋషులందఱును వత్తురు.

భర—సంయమీంద్ర! ఋషివర్గపు నామావళిఁ దెల్పిన నందఱకికి విజ్ఞప్తులఁబంపెదము. మీ కెవ్వరెవ్వరిష్టమో వారిని ఋత్విక్కులనుగా నొనర్పనగు.

వశి—మంచిది. సుమంత్రునకు వ్రాసియిచ్చెదను.

రామ—మంత్రి శిఖామణీ! నేఁడే యాహ్వానపత్రికల వ్రాయించి సకల బంధు మిత్రులకు, రాజకోటికిఁ బంపుము. వేగముగల యాశ్వికులను గిష్కింధకుఁ బంపికపిసైన్యముతోఁ గూడ సుగ్రీవుని రమ్మని వ్రాయుము. అతని పత్రికలో హనుమంతునో, నీలునో లంకకుఁ బుత్తెంచి విభీషణుని సకుటుంబసపరివారముగా నేతెంచునట్లు చేయుమని వ్రాయుము.

సుమం—చిత్తము.

రామ—భరత! నీవు కేకయాధిపతిని నచ్చటి బంధువర్గమును బిలుచుకొని వచ్చి భాండారాధిపతివై నిల్వవలయు.

భర—చిత్తము.

రామ—లక్ష్మణా! నీవు మిథిలకేగి మామగారిని గుటుంబసమేతముగాఁ దోడ్కొని వచ్చిరాబోవు వారికి విడుదులు మున్నగు సత్కారములఁ జేయుచు, మన కపిసమూహములచేఁ దక్కుంగల కార్యముల నొనర్పించుచుండుము. నీకు సుగ్రీవుఁడు సహకారిగానుండును.

లక్ష్మ—మహాప్రసాదము.

రామ—అన్నా! శత్రుఘ్నా! పేఁపనికన్న నీపని భారమైనది. నీవశ్వరత్నము వెంటసైన్య సమేతుఁడవై పోవఁదగు. (సుమంత్రుఁని

చూచి) అనఘా! లక్షణవంతము జవనాన్వితమునగు నొక హయమును దెప్పింపుఁడు.

సుమం—భాగ్యము. సేవకా!

(సేవ॥ ప్రవేశము)

సుమం—నీవుపోయి యశ్వశాలాధ్యక్షునిఁ గాంచి రామాజ్ఞ దెల్పి యశ్వమేధము కొఱకు పారసీకము నుండి వచ్చిన పంచవర్ణతురంగము నలంకారము చేసి పట్టుకొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమణ)

రామ—మహర్షివర్య! అంతయుసరియే (అని ఖిన్నుఁడగును).

వశి—మఱియేమి? రామా! మఱేమి? చింతించెద వేల?

రామ—సీత (అని నిట్టూర్పులఁ బుచ్చును).

(భరతాదులు) హా! తల్లి! (అని వ్యసనపడుదురు).

వశి—దాశరథులారా! వ్యసన పడకుఁడు. సీతాదేవిని సందర్శించు దినములు సమీపించుచున్నవి. ఎప్పుడని చెప్పఁజాల పదిపండ్రెండు సంవత్సరములు శాంతత వహించి యుంటిరి. ఇఁక కొన్ని దినములోర్చుకొని యుండుఁడు. ఇట్లుంగి చింతాగ్రస్తులగైన నింత పెద్ద యజ్ఞము నెక్కరణి నెరవేర్పఁగలరు?

రాము—స్వామీ! అందులకుఁగాదు. భార్యలేకున్న యాగకార్యమెట్లని విన్నవించితిని.

వశి—అటులనా? అందులకు శాస్త్రాధారమున్నది. భార్యనుబోలు హిరణ్మయ ప్రతిమనుగావించి ప్రతిష్ఠ చేసికొనవచ్చును. సంకల్పించి యాగము నెరవేర్పవచ్చును.

సుమం——మునీంద్రా!

చ॥ తిరముగ దేవకాంతలను ధిక్కృతి నెంతయు జేయఁజాలు సుం
దర సుకుమార రూపయగు ధర్మసతీమణిఁ గల్గియుండి య
చ్చెరువుగ రాఘవేశ్వరుఁ డచేతనమౌ నొక ప్రైడిబొమ్మ నే
వరసతిఁ జేయఁగా వలసివచ్చెనె! హా! విధి నేమనంగలన్॥

ఒక్కొక్క సందర్భమున నొక్కొక్క శాస్త్రమును మీ రుదహరింతురు. అవి యెన్ని విధములనున్నవో యాశ్చర్యముగా నున్నది.

వసి——సుమంతా! ధీమంతుడగు నీ యంతటి వాఁడిట్లన్న నెట్లు? శాస్త్రములనెల్లను మనపరిస్థితులఁబట్టియే యనుభవవేత్తలగు మహాత్ములు వ్రాసియున్నారు. వానిని విడిచి మన మెక్కార్యమును జేయజాలము. వ్యసనాతిశయమున నట్లు పల్కితివి. కాని నీకు తెలియదా?

ప్ర——సేవకుడు-అశ్వము.

రాము——గురూత్తమా! ఈ హయముఖమున నొక బిరుదపుఫలకమును వ్రాసి కట్టుడు.

వసి——అవశ్యము. (అని ఫలకమును వ్రాసి) ఇదిగో చదివెదను, వినుఁడు.

ఉ॥ వీరసతీతనూభవుఁడు, వీరవరాగ్రణి పాదపద్మఁడౌ
శ్రీరఘురామచంద్ర నృపశేఖరుఁ డంపిన యధ్వరంపుబల్
ఘోటకమిద్ది, సల్పుఁడగుఁ బ్రాభవగౌరవమెల్ల భూపతుల్
ధీరతఁబట్టఁగా దలఁచు దిట్టలు పట్టగవచ్చునోపినన్!

రాము——సరియే, (అనిహయమును బూజించి పట్టికఁగట్టి) శత్రుఘ్నా.
ఈ తత్తడివెంట మొత్తముతోఁ బొమ్ము.

శత్రు——అన్నా! ఈ యశ్వమువెంట దిఁగి వచ్చుటకు నాకు మొత్తము లేల!

ఉ॥ దిక్కులఁ బాఱుఁగాక, పలుదేశములన్ విహరించుఁగాక, లా
వెక్కిన వీర్యవంతుఁ డెవఁడేనియు దీనినిఁ బట్టుగాక, నే
నొక్కఁడ జాలనే యతని యూపిరిఁ బాపి హయంబుఁ దేగ నా
యుక్కుమగంటిమిం గను, రఘూత్తమ! యేటికి నాకు మొత్తముల్॥

రాము——అన్నా! నీ శౌర్యమునకు సంతోషమగుచున్నది. అయినను సహాయసంపత్తితోఁ బోవుట న్యాయమని చెప్పెదను.

శత్రు——నీయాజ్ఞానుసారముగా నదే రీతి సైన్యయుతుఁడనై పోయెదను. గురుచంద్రమా! సెలవొసంగవలెను. (నమస్కృతి)

వసి——మంచి వీరుఁడవనిపించుకొనుము.

శత్రు——అన్నలారా! ఇదే సెలవు పుచ్చుకొనెదను.

రామ——తమ్ముఁడా! శుభముగాబొమ్ము. (శత్రు-నిష్క్రమణ)

భర——ఋషివర్యా! మన సవనాశ్వ మెల్లరచే సత్కరింపఁ బడివచ్చునని యేనానమ్మిక.

వసి——ఏమియో! ఇంత దేశమున నొక ఇద్దరైన గుఱ్ఱమును బట్టఁదలచు శూరు లుండరా యని నాకు సందేహము.

లక్ష్మ——అట్లుండిన నట్టివారు మన శత్రుఘ్నునిచేఁ దప్పక జయింపబడుదురు.

వసి——సంతోషము.! ఆవార్త ముందెఱుక పడఁగలదు. విందుముకద!

సుమం——రాజేంద్ర! తక్కిన ప్రయత్నములు చేయఁదగినవిచాల నున్నవి సభావిరామమునకనుజ్ఞ యియ్యదగును.

రాము——నిజమే. అవశ్యము, లెండు (నిష్క్రమింతురు)

(ఇది చతుర్థాంకము)

# రామకుమారాభ్యుదయము.

## పంచమాంకము.

వాల్మీకియాశ్రమభూమి, సీత, ప్ర॥

(స్వ॥)

చ॥ కలుగునె నామనోవిభునిఁ గాంచెడుపున్నియమెన్నఁడైన, న
త్తలచరణాంబుజాతములఁదద్దయు ముక్కెదినంబులబ్బునే
లలిఁజెలియంద్రఁగన్గొనెడు లాభముగల్గునె యెన్నఁడేనియే
నలవడునే మదీయసుతు లప్పనుజూచు సుయోగమీశ్వరా॥

అకటా! ఈయరణ్యవాసము నాకెన్నటికైనఁ దప్పునే! ఈ జన్మమున నే నయోధ్యానగరముఁజేరు పుణ్యము నోచియున్నానా? నాపుత్రులతోఁగూడ నాహృదయేశ్వరునిఁ జేరుసుకృతము నాకొకనాటికిఁ బ్రాప్తించునా? ఓహో! నాయెడమకన్నేటికో యదరుచున్నది. వాల్మీకులవారు "నీవారినందఱిని నీక గొన్నిదినంబులలోఁ జేరుదువు చేరుదువు" అని పలుమాఱు చెప్పుచున్నారు. వారి వాక్కు లనృతములు గావు, అనుకొన్నవేళకే యీశుభశకునమయ్యె. నిక్కముగా నాప్రాణేశ్వరుని చరణారవిందము చెంత నింతలోనే చేరుదును గాఁబోలు, నాతనయులు "అమ్మా! మనపట్టణమున కెప్పుడుపోదము, మాతండ్రిగారి నె

స్పుడు చూచెదమని నాకన్న నెక్కువగాఁ దవ్వరపడుచున్నారు. తాతగారి యాజ్ఞయయినపుడు పోఁగలమని బదులుచెప్పుచు న్నాను. ఇది యట్లుండ మహర్షివర్యుఁడు తానురచించిన రామాయణమును మీచేఁ జదివించుచున్నాఁడు. "అమ్మా! ఈకథ లోని రాముఁడు మాతండ్రియేనా? సీతవు నీవేనా?" యని పెక్కుమారులడుగుచున్నారు, అది యొకకావ్యము. వారువారే, మేము మేమేయని బొంకజాలక యుపాయముగాఁ జెప్పుచున్నాను. ఇటు కొన్నిదినములు సమాధానపఱచుచుందును.

ప్ర—లవుడు.

లవు—అమ్మా! ఇవిగో! నీకొఱకుఁ బారిజాతములను, సీతాఫలములను, దెచ్చియున్నాను, గైకొమ్ము.

సీత—నాయనా! సంతోషము.

లవు—ఈపువ్వులను నీకొప్పున దురిమెదను. వలదనకుము.

సీత— తురువుమయ్యా! నీకెంతయిష్టమో.

లవు—(పూలనునిచ్చి) అమ్మా! ఈపండ్లకు సీతాఫలములని యేల పేరు? నీకుఁ జాలయిష్టమా?

సీత—ఔను, అందుచేతనే యట్లు పిలువఁబడుచునవి దండకారణ్యమున రామరఘురీప్రాంత్యముల నిక్కుటముగాఁ బండుచుండును. నీవు తినుము.

లవు—నీవు వలయునన్ని తీసికొనుము. అన్నకుఁ దీసియుంచుము. నాకు రెండిమ్ము.

సీత—ఆ॥ వె॥ నన్నుఁగన్నతండ్రి! నాముద్దుభాగ్యంబ
నాదుప్రియతనూజ నాతపంబ
నాదుప్రేమరాశి! నాగుణరత్నంబ
లలితసుమశరీర! లవకుమార॥ (అనిముద్దాడును)

అన్నా! నీయన్న యెక్కడఁబోయె?

లవు—ఒకపులిని దఱుముకొనిపోవుచుండె. నేనిట వచ్చితి.

(ప్రి—ధనుఃపాణియై పులిపిల్లతోఁ గుశుఁడు.)

సీత—(దిగ్గున లేచి) కుశా! నీసందిటనుండునది యేమి?

కుశు—అమ్మా! నీవు సాకికొనుటకు నొకపిల్లికూనం గొనివచ్చినాను.

సీత—అయ్యో! ఇదియేమి పిల్లికూన? పులిపిల్లను దెచ్చియున్నాడవే?

కుశు—దీనితల్లిం దఱిమి పరిమార్చితిని. ముద్దుగానున్న దీనినిఁ గొని వచ్చితిని.

లవు—అన్నయ్యా! ఇదినీకాయె. నాకొకటిలేదా?

కుశు—తమ్ముఁడా! ఇదియొకటియే యుండె. వలయునన్న నీవుపెంచుకొనుము.

సీత—పిచ్చికుమారులారా! ఇది యేమి యాట? పిల్లికూనలని యనుకొన్నారా? కుక్కపిల్లలని యనుకొన్నారా? ఇది చెనటిమృగము. ఇప్పుడు ముద్దుగాఁగన్పించును. పెద్దదైనహానికరము. విడిచిపెట్టుమయ్యా! నాకు భయమగుచున్నది.

కుశు—అమ్మా! అటులయిన విడిచెదను. (అని వదలగానది పాఱిపోవును.)

సీత—తండ్రీ! ఇఁక నీమెకముల వేటాడఁబోకుము. ఇవియెప్పుడైన హానిఁ గలుగఁజేయును.

కుశు—అమ్మా! నాకంటఁబడినమృగము బ్రతికిపోఁగలదా?

సీత—అన్నా! నీబీరముఁనకు సంతసమగుచున్నది. కాని దుష్టమృగముల జోలిపోవుట యపాయమని చెప్పుచున్నాను.

లవు—రాజకుమారులు వేటాడవచ్చునని తాతగారుచెప్పిరే?

సీత—ఔనప్పా! నిజమే. ఇప్పటినుండి మీకువేటప్రసక్తి యేల? పెద్దవారై యశ్వారోహణము నేర్చుకొని సైన్యయుక్తముగా రాజులు వేటకుఁబోవుదురు,

లవు—ఇప్పటినుండి యొకటొకటి నేర్చుకొనినఁగదా పెద్దవాండ్రమైనప్పుడు పరిపూర్ణుల మగుదుము.

సీత—నిజమే, కాని వాల్మీకితాతగారేమేమి యిప్పుడు నేర్పుచున్నారో వానిని శ్రద్ధగా నేర్చుకొనుడు

లవుఁడు—తాతగారి రామాయణములో నాలుకాండముల ముగించి యున్నాము. ఏడవది ప్రారంభించినాము.

సీత—(స్వ) "నిజముగాఁ బ్రారంభమేయయినది"

కుశ—అమ్మా! నీవన్నయట్లు హయారోహణము నేర్చుకొనవలెనని నాకుఁ గుతూహలమున్నది. కనుక నాకొకగుఱ్ఱము కావలెను.

లవుఁడు—నాకు నొకపెద్దహయము కావలెనని కోర్కెయున్నది.

సీత—నాయనలారా! మీకశ్వముల నేనెక్కడఁ దెత్తును? మనము పురికిఁ బోయిన యెడల—

కుశు—సూర్యునిరథమున కేడుగుఱ్ఱములున్నవట నే.

సీత—అవును. అయిన?

కుశ—వానిలో రెండుతురంగముల నింగినుండి లాగుకొనివచ్చులాగున నాబాణముఁ బ్రయోగించెదను. అతని కయి దేచాలును.

సీత—క॥ నాపాపడ! నాబంగరు
నాపేరిమిముద్దులయ్య! నాజాబిల్లీ!
నాపుణ్యఫలమ! నాకుల
దీపక! కుశ! నాదుసుఖనిధీ! నాయన్నా॥

(అని కౌగిలించుకొనును.)

పుత్రులారా! మీశూరతకుసమ్మోదమగుచున్నది. అట్టిపనియేమియు వలదు. మనపట్టణమునకు బోయిన యెడల వలయునన్ని వారువము లుండును.

లవు—మన పురమున కెప్పుడు పోవుదుము?

కుశు—మాకు ముగురవ్వగార్లున్నారంటివే? వారిందరను జూడవలయును.

సీత—వాల్మీకి తాతగారి యాజ్ఞయైనపుడు పోదము.

లవు—ఆయన యానతి నెపుడొసంగునో?

కుశు—లేకున్న మనమే తాతగారి సెలవుపొంది మనవారి నందఱిని చూచుటకుఁ బోవుదమా?

సీత—(స్వ) నాకంటె నెక్కువగా కుతూహలపడుచున్నారు. నేనేమిసే యుదును. కుమారులారా! ఇంతలోనే మునీంద్రుఁడు సెలవొసం

గును. ఏల త్వరపడెదరు? అతని యాజ్ఞ మీరిన నతనికిఁగోపము వచ్చును.

(ప్ర—హృషీకేశుఁడు.

హృ—కుశలవులారా! మేము పత్రపుష్పములకై పోయెదము. మీరు వచ్చెదరా?

కుశ—వచ్చెదము, పోదము పద.

సీత—నాయనా! హృషీకేశా! చాలదూరము పోవకుఁడు.

హృ—లేదమ్మా! ఈప్రాంతములకే పోయివత్తుము.

లవు—అమ్మా! ఇదే పోయివచ్చెదము.

సీత—అన్నలారా! జాగ్రతరండు. ముగ్గురు (నిష్క్రమింతురు.) (స్వ) నా సుతులు గుణమునందును, ధీరతయందును. నానాథునే పోలి యున్నారు. అతనికి చూచుపుణ్యము లేదుకదా? అద్దాని గాంచు భాగ్యము నాకెన్న డబ్బునోకదా. మహాత్మ వాక్యముల నాసపెట్టు కొని యున్నాను. అదెన్నటికి ప్రాప్తించునో నాకుఁ దెలియదు. హా! మనోనాథా! రఘునాథ!

(లోపల—సీతాదేవిఅని ధ్వని)

చారుహాప యేలకో పిలుచుచున్నది. అమ్మా! ఇదెవచ్చితిని.

(నిష్క్రమించును)

వనసీమ; లవుడు, హృషీకేశుడు, శ్రీవత్సుఁడు:—

లవు—శ్రీవత్సా! ఇచ్చటవలయునన్ని పుష్పములు ముచ్చటగా ఎదిగి యున్నవి. కోసికొందము. మాయన్నయు మృత్యుంజయుఁడును రాలేదే?

శ్రీ—లవకుమారా! వారుభయులు సమిత్కుశాదులకొఱకు దక్షిణ భాగమునకుఁ బోయియున్నారు. వచ్చెదరు.

లవు—హృషికేశా! ఈబిల్వదళము లెంతచెల్వొప్పుచున్నవో చూడుము. ఒక గంపెడు సేకరింపవచ్చును.

హృషీ—ఇది మహేశ్వరప్రీతిపాత్రమగు పత్రము. కరము పవిత్రమైనది కదా? దీనిచే మన మతనిని బూజించినమనకులముపవిత్రమగును,

లవు—అయ్యలారా! పురవాసమునకన్న వనవాసమే రమ్యముగానుండు నని తోచుచున్నది. ఈ బహువిధ పత్రములు, దివ్యగంధాంచిత పుష్పములు, నానావిధ సరసఫలములు, విశాలోన్నతము లగు మనోహరములైన వృక్షములు, రమ్యతరసరస్సులు పురములనుం డునా?

శ్రీ—ఇట్టి మనోజ్ఞసీమలనియు. నిర్జనప్రదేశములనియు మన పెద్దలిందుఁ దపము గావించుచుందురు. నీవన్నయట్లు లీవృక్షము లెంత రమణీయముగా ఫలభరితములయినవి చూచితివే?

హృషీ—శ్రీవత్సా! వానిలో నీ మామిడిచెట్టుంజూడుము. తనపండ్ల బరువుచే నెంతవ్రాలియున్నదో?

లవు—ఈ చూతతరువు మనకొక నీతినేర్పుటకై యిబ్బంగి వంగి యున్నది.

తే॥ గీ॥ విద్యగల వాడొకింతయు విఱ్ఱవీఁగ
కెపుడు వినయంబెగలిగి రహింపవలెన।
టంచుఁ దెలిపెడిభంగితా నధికఫలత।
నమ్రతవహించినది కనుఁ డామ్రతరువు॥

శ్రీవ—లవకుమార! ఎంతయు నిజమే. ఈ పలుదినుసుల మ్రాకులు నేత్రానందముగ విలసిల్లియుండుటఁ బొగడఁదరము గాదు.

"ద్విరద గతి రగడ."

కాంచుమురసాలముల। ఘననారికేళముల।
మించుసురసాలముల। మిన్నందుతాళముల!
ఈ చంద్రజాలముల। నీ గంధమూలములఁ।
బూచిన తమాలములఁ। బొనరు తక్కోలముల।

హృ—కనుము కుద్దాలములఁ। గనుము కృతమాలములఁ।
గొనబా ప్రియాలముల। గుంపు లోతూలముల।
ఇవె కందరాలముల। నీనక్త మాలముల
సవ్యరైన జాలముల! జ్ఞానైన సాలముల॥

లవు—అరయుము లవంగముల । నామాతులుంగముల।
పారుపొప్పు తుంగముల । నానాగరంగముల।
నేరెడుల నిగనిగలు । నిచులముల జగజగలు।
మారెడుల సొగసొగలు । మల్లియల భుగభుగలు।
దానిమ్మ తళతళలు । తాళముల పళపళలు।
నీనిమ్మ మిలమిలలు । నీనెల్లి జలజలలు॥

ప్ర—యజ్ఞాశ్వము.

శ్రీవ—ఓహో! ఇక్కడఁజూడుఁడు. ఎంతపెద్ద గుఱ్ఱము? ఎక్కడనుండి వచ్చెనిది. అబ్బా! మీఁదికే వచ్చుచున్నది. (అని దూరము జరుగును.)

హృషీ—ఔనురా! కొఱుకబోయెడిని.

లవు—ఆహా! నేఁడునాకోరిక ఫలించె మంచిగుఱ్ఱము. చిక్కెను. అయ్యలారా! అటులేల భయపడెదరు? ఎన్నివన్నెలు గలిగి యెంత యందముగా నున్నది. చూడుఁడు (అని సమీపించి దానినిఁ దట్టును.)

శ్రీవ—అయ్యో! లవకుమారా! కొఱికెడి, కొఱికెడి,

హృషీ—తన్నెడిని, తన్నెడిని, ఎంతమదించిన హయమప్పా? ఏమి? దానిపై నేదియో నిగనిగఁ గట్టఁబడియున్నది.

లవు—ఇదియొక బంగరురేకు, వ్రాసి కట్టియున్నారు. చదువరండు.

శ్రీవ—నాచేత గాదప్పా! దాని నూడఁదీసికొని నాయొద్దకుఁ దెమ్ముఁ చదివెదను.

లవు—(ప్రయత్నపడి) ఇదిరాకున్నది. హృషీకేశా! నీవు విప్పుదువు రమ్ము. ఈయశ్వము సాధువుగానున్నది.

హృషీ—నీవుగట్టిగా బట్టుకొనుము. నేను విచ్చెదను. (అని సమీపించి) అదిగో! సాధువంటివి కదయ్యా! కొఱుకఁబోవు చున్నది.

లవు—కాదు! మొగము కదలించినది. భయపడకుము. (హృషీకేశుఁడు పట్టికను విడదీసికొని దూరమేగును.) ఇకఁజదువుము.

హృషీ—ఓహో! ఇందొక యుత్పలమాలను వ్రాసియున్నారు. వినుడు.

ఉ॥ వీరసతీతనూభవుఁడు, వీరవరార్చిత పాదపద్ముఁడా
శ్రీరఘురామచంద్ర నృపశేఖరుఁడన్పిన యధ్వరంపుబల్
వారువమిద్ది. సల్పఁదగుఁ బ్రాంచిత గౌరవమెల్ల భూపతుల్
ధీరతఁ బట్టగాఁ దలఁచుదిట్టలు పట్టఁగవచ్చు నోపినన్॥

లవు—ఏమి! ఈపాఁచదువుము. వలదిటుతెమ్ము. (అని తానే చదివి) ఓహో! ఇదియొకయజ్ఞాశ్వమా! వీరసతీసుతుఁడట. వీరవరార్చితుఁడఁట. రఘురామచంద్రుఁ డనురాజఁట, గౌరవించవలెనఁట, ధీరులైనవారు పట్టవచ్చునఁట. రఘురామచంద్రుఁడెవరు. మా తండ్రిపేరు రాముఁడు. రామచంద్రుఁడని మాతల్లి చెప్పుచుండె, అతనిదియై యుండునా? కాదు, మాతల్లి లేనిదే యతఁడు యజ్ఞమెట్లుచేయును? ఇతఁడెవఁడో మఱియొక రామచంద్రుఁడు ఉండవచ్చును, ఒకపేరు బోలు మఱియొక రుండఁగూడదా? దీని నవశ్యముగా బంధించెదను. (అని తనయుత్తరీయమున నశ్వమును బిల్వవృక్షమునకుఁ గట్టును.)

శ్రీవ—అయ్యో! అయ్యో! ఇదియొక క్రతుహయము. ఎవరో రాజేంద్రుఁడు పంపినది, దీని గొడవమన కేల?

లవు—నేను రాజకుమారుఁడనుగాదా! మాతల్లి వీరమాతకాదా! మీ రేలభయపడెదరు?

ఆ॥ వె॥ వెఱవనేల? రాచబిడ్డనేఁ గానె।
మాసవిత్రి వీరమాత గాదె।
కరము దాల్చునిద్ది కార్ముకమును గాదె।
యేను పిఱికివాఁడనే? తలంప॥

కట్టినాఁడనుసరి. దీనివెంట నెవరు వచ్చెదరో చూతము, ఎట్లు విడిపించికొని పోయెదరో!

వ్యాఘ్రపా—అయ్యో! లవకుమారా! నీవుదిట్టవేకాని ఈహయమువెంబడి గొప్పవారగు యోధులు వత్తురు. నీవుబాలుఁడవు. వారితోఁ బోరెదవా?

లవు—యోధులు రానిమ్ము. యోధాగ్రేసరులు రానిమ్ము చూచెదను. మనవాల్మీకి తాతగారు నేర్పిన విలువిద్దె నెంపు నేఁడు పరీక్షఁ జూపెదను.

(ప్రవేశము. జయద్బలుఁడు, బృహద్బలుఁడు. (భటులు)

జయ—బృహద్బలా! ఇదిగో మనహయము. అయ్యా! మీరు ముని బాలకులా? ఈగుఱ్ఱమును గట్టిన వారెవరు?

లవు—మేమే కట్టియున్నాము.

శ్రీవ—ఈ మామిత్రుఁడు వలదన్నను బంధించినాఁడు.

బృహ—జయద్బలా! ఈపిల్లవాఁడు బ్రాహ్మణ కుమారుఁడు కాఁడు. రాజకుమారునివలె యున్నాఁడు. అయ్యా! నీ వెవరవు?

లవు—ఎవరైననీ కేమి?

బృహ—అబ్బా! అయ్యా! ఇదియొక యజ్ఞాశ్వము. మా రాజేంద్రుఁడు విడిచియున్నాఁడు.

లవు—ఔను. నేను దెలిసికొన్నాను.

జయ—దయచేసి విడిచెదవా? పసిబాలుఁడవు. నీ వేమియు నెఱుఁగవు.

లవు—ఎఱుఁగక పోయిననుమానె. నేనువిడుచుటలేదు.

బృహ—అయిన నాతోఁ బోరెదవా?

లవు—అవశ్యముగాఁ బోరాట మొనర్తు. ధనుస్సుపట్టియుండుటెందుకు.

బృహ—ఔరా! బాలక!

శ్రీ—వ్యా—అయ్యా! విడిచిపుచ్చుము, విడిచిపుచ్చుము.

లవు—మీరూరకుండుఁడు.

జయ—కుమారా! ముమ్మాటికిఁ జెప్పుచున్నాము. ప్రమాదమగును.

లవు—అదెట్టిదియో చూచెదను.

బృహ—జయద్బలా! ఈకుఱ్ఱనిఁ బలుమాఱు బ్రతిమాలుటేమి? మన గుఱ్ఱమును విడుచుకొని పోదమురమ్ము. (అని గుఱ్ఱము చెంతకుఁ బోవుచుండఁగా లవుఁడు బాణము వేయును—బృహద్బలుఁడు పడును).

లవు—(జయద్బలునిజూచి) నీవును వచ్చెదవా?

జయ—లేదయ్యా! వలదయ్యా! (అని పరుగెత్తిపోవును)

శ్రీవ—సెబాస్! జానకితనయా! ఇంతటిభటుని నొక్కబాణమునఁ బ్రాణమునుదీసితివే! వీనిపేరేబృహద్బలుఁడఁట

హృపీ—అయ్యా! ఇఁక ప్రమాదమగును. ఆ హతశేషుఁడగు జయద్బలుఁడు పాఱిపోయె. వాని సేనయో యధిపతియో రానోపును. మనము పోదమురండు.

లవు—కొంచెము సేపు చూచి యెవరును రాకున్న నివ్వాజిని దోలుకొని పోదము.

హృపీ—అబ్బా! ఈ గుఱ్ఱ మెక్కడనుండి వచ్చె మన కీదినము?

ప్ర—శత్రుఘ్నుఁడు, జయద్బలుఁడు మొదలగువారు.

జయ—స్వామీ! అదిగో యా చిన్నవాఁడే మిక్కిలి గర్వమున మన తురంగమును బట్టియున్నాఁడు, అదిగో బృహద్బలునిఁ బొరిఁ గొన్నాఁడు.

శత్రు—బాలకులారా! మీ రెవరు?

శ్రీవ—అయ్యా! మేము మునికుమారులము. మీహయమును మాస ఖుఁడితఁడు బంధించినాఁడు,ఎంతచెప్పినను మామాట వినకపోయె.

శత్రు—కుమారా! నీవెవరవు?

లవు—నేనువాల్మీకి మహర్షి శిష్యుఁడను,

శత్రు—నీతలిదండ్రు లెవరు!

లవు—ఆప్రసంగమునీ కేల? నీవువచ్చిన పనిని జూచుకొనుము.

శత్రు—(స్వ)—వీఁడు విప్రకుమారుఁడుఁ కాఁడు ఎవఁడో రాజపుత్రుఁడు— ఆహా! నాది యధిక ప్రసంగమా? ఇంతటిమాట నిదివఱకు నాపెద్దలైన నన్నన లేదు, పసిబాలుఁడవుగనుక నిన్నుమన్నించినాను.

లవు—నీమన్ననలఁ బడయుటకై నేనిందురా లేదు,

శత్రు—ఈయజ్ఞాశ్వము నెందులకుఁ గట్టియున్నావు?

లవు—కట్టుటకొఱకే కట్టియున్నాఁడ.

శత్రు—ఎవరు పంపినారో తెలియునా?

లవు—దాని మొగమున వ్రాయఁబడియున్నది, చదువుకొన్నాను.

శత్రు—

శా॥ ఆరామక్షితినాథు తమ్ముఁడ, రిపుప్రాలేయమార్తాండుఁడన్
వీరానీకవిజేత, నుత్తమధనుర్విద్యాధురీణుండ, బల్
శూరుండన్, లవణాంతకుండ, ననిలోఁ జూడంగ రాదేననున్
ఓరీ! బాలక! యింత లేవు వినుమా! యుద్ధంబునీ కేలరా॥

లవు—ఓహో! నిన్ను నీవే పొగడుకొనవలెను. నీవు లవణాంతకుఁడవా? ఎంతయు మెప్పైనను గ్రమింగెదవు కాఁబోలు! లవణాంతకుఁడవో, లవణసముద్రప్రాశనుఁడవో నీబిరుదములు నూఱుండవచ్చును. వాని తోనా కేమి? నన్నుఁ బాలుఁడంటివి?

క॥ బాలుఁడనో సంగ్రామా
భీలుఁడనో వీరగర్వ భేదనచతురో
ద్వేలుఁడనో బాణకళా
శీలుఁడనో యెఱిగెదిపుడు చెప్పఁగ నేలా॥

నేను బాలుఁడనైనను నా చేతినారాచము లెంత పెద్దవియో యెఱుఁగఁగలవు.

శత్రు—ఆహా! ఈబాలకుఁ డెంతధీరుఁడు? అయ్యో! ఇంతదేశము దిరిగితిని ఒకరాజైన నీహయము జోలికి రాలేదు. బహుళసత్కారముల నర్పించిరి. తారొక్కన్నయవివేకులు నాచే నిర్జింపఁబడిరి. నీవు చిన్నవాఁడవు. ఏల యీపనికిఁ బూనియున్నావు. అర్థమెఱుఁగుదువా?

లవు—ఎఱిఁగియే సమకట్టియున్నాను. ధీరులగు రాజులు లేకుండవచ్చును. నీయశ్వపాదములఁ బూజించియుండవచ్చును. మాతల్లి వీరమాతయఁట. మాతల్లి వీరమాతయగునో కాదో చూడవలెనని యున్నాను. మెండియు దిట్టలగువారు పట్టవచ్చు నని యొక శపథము వ్రాసియున్నారు. అందుకై యీ తేజినిబట్టియున్నాను.

శత్రు—అంతటిధీరుఁడవా?

లవు—ఔను.

శత్రు—కుమారా! నామాటదయచేసివినుము. నీవు మున్ దెఱుఁగవు. యుద్ధమనఁగా నెట్టిదో యెఱుఁగవు.

లవు—అద్దాని నిప్పుడు నేర్చుకొనవలెనని యున్నాను.

శ్రీవ—వలదయ్యా! విడువుము గుఱ్ఱమును.

శత్రు—ఇఁకముందు నేర్చికొందువు. ఈహయముతో నావెంటరమ్ము. మాయన్నగారు యజ్ఞము సేయుచున్నారు. నీకు గావలసినభక్ష్య భోజ్యములను, దివ్యవస్త్రములను నిప్పించెదను.

ఋషి—అయ్యా! గుఱ్ఱమునుదోడ్కొని యతనివెంబడి పోవుదమా?

లవు—మేమడవినుండువారమని, తిండిలేక బట్టములులేక నడలుచుండు వారమనియా నీగర్వప్రలాపము. మాతాతగారియొక్క కామధేను వున్నది. నీకును నీసైన్యమునకును వలయునన్ని షడ్రసోపేత భోజ్యములను దుకూలములు నిప్పించెదరమ్ము. నీప్రసంగము చూడఁగ దిండిపోతువలెనున్నావు,

గీ॥ తిండికలిగిన నేమి లేకుండ నేమి
కేసరి కిశోర మెప్పుడుఁ గేసరే య
పారముగ నెట్టిదానిని నారగించు
దున్నపో తెప్పుడును బెద్దదున్నపోతె॥

శత్రు—(స్వ) అరరే యీచిన్నవాఁడిని పోనాడుచున్నాఁడు! మిగుల జదువరియునగును. వీనియెడ నిఁక సామ్యవాక్యములు పనికి రావు. అయ్యా! విడువవా గుఱ్ఱమును? ముమ్మాటికి విడువవా?

లవు—ముమ్మాటికిని విడువను.

శత్రు—నాతోఁ బోరెదవా?

లవు—నిస్సందేహముగా.

శ్రీవ—హా-విడువుమయ్యా! గుఱ్ఱమును, నీగుఱ్ఱమునెత్తిపై వానగురియు.

లవు—మీరూరకుండుఁడు,

శత్రు—బాలకా!

ఆ॥ గట్టివయసువాఁడ, కలహదక్షుండ నే
న స్త్రశస్త్రవేది నధికబలుఁడ
నశ్వరక్షకొఱకు నరుదెంచినాఁడ నా
తోడ నిలిచి పోర నీఁడుకావు॥

లవు—
బుడుతవయసువాఁడ పోరునెవ్వరిని, స
ర్వాస్త్రశస్త్రవిద్య నమరినాఁడ
వాజబంధదీక్ష వహియించినాఁడ నా
తోడఁ బెనఁగి కయ్య మాడలేవు॥

శత్రు—కుమారా! నీమాటలవిన్నఁ గోపమువృద్ధియగుచున్నది. నిన్ను జూచినంతట వింటిని దాఁడుగ బుద్ధిపుట్టకున్నది.

లవు—నీవిలాగుననే మాటలఁ బ్రొద్దుబుచ్చుటకేనా వచ్చియుండునది. పలుక నేర్చితివి గాని ములికి నేర్చితివిగాఁ దోఁపలేదు. నీవు బాణముల వేయకున్న నేను వేసెదను, జూడుము. (అని యొక యమ్ము వేయును.)

శత్రు—'అబ్బా'యని చేతినిచూచుకొని, చిన్నవాఁడయ్యు దెబ్బ పెద్దది గానున్నది. ఓరీ! ఇఁక, నేదయజూచుటలేదు. ఇదిగో నాములికి దెబ్బఁజూడుము.

పం॥ చా॥ శిశుండ! చూడరా మదీయశాతసాయకంబులన్
గోరశిఖ నీదుమేన గాడిపోవు నిప్పుడే
(అని వేయును)

లవు—
కుఠారధార చెట్లఁబోలెఁ గూర్చు నాలకోరిచే
పతీలటంచు నీశరాళి వ్యర్థమౌను వీరుఁడా॥
(అని ఖండించును)

అదిగో! నీములికి గోడములికియే. మూడుతునుకలైనది చూడుము. ఇదిగో నాశిలీముఖము నీముఖమును ముద్దుపెట్టుకొనును. జూడుము.

(అని మరలబాణము వేయును)

శత్రు—(స్వగతము) ఆహా! ఈబుడుతఁడు సామాన్యుఁడుకాఁడు. నాకాండముల మధ్యనే ఖండించుచు నన్ను నొప్పించుచున్నాఁడు. అస్త్రప్రయోగము చేతనే వీని కపాయములేకుండ జయింపనగును, సమ్మోహనము బ్రయోగించెదను. (అని బాణము వేయును లవుఁడు క్రిందఁబడును.)

శ్రీ—హా—హా! లవకుమారా! (అని పరుగెత్తిరి)

శత్రు—(లవునిఁజేరి) అయ్యో! కుమారా! నేనెంతచెప్పినను వినవైతివే? నీయట్టి ధీరబాలకు నిదివరకుఁ చూడలేదు. అకటా! చిన్నవాని నేఁడీ దినమున గెడిపితినే. నాకెట్టి పాపము రానున్నదో! వీని తలిదండ్రులెవరో! ఎంత దురపిల్లుదురో గదా! నన్నెంత శపింతురో దైవమా! ఏమిసేతును? నేనపరాధ మొనర్ప లేదు. నాధర్మమును నేను నెఱవేర్చినాను. ఇచ్చట దుఃఖించుచున్న ప్రయోజనములేదు. అశ్వమును దోలుకొని నేపోవవలయు ఈకుఱ్ఱని విడిచిపోదునా? లేక కైకొనిపోదునా? ఈముద్దుబాలుని విడిచిపోవఁజాల. వీనిని గొనిపోయి మాయన్నచెంతనిడి నన్ను మన్నింపవేడెదను. నీపరాక్రమమట్టి పసివానిపైఁ చూపితివే. శత్రుఘ్నా! యని యన్నగారు నన్నుఁగోపించిన యెడల నే నేమిఁ చెప్పుదును, హా! శ్రీహరీ! ఉన్న విషయము విన్నవించి మన్న నవేడెదను. అందుపై యతని చిత్తము, నాభాగ్యము.

జయధ్వజా! ఈపోరని రథమునందుంచుము. హయమును దోడ్కొనిరండు పోదము.

జయ—చిత్తము. (అందఱు నిష్క్రమణ)

పర్ణశాల సీత, శ్రీవత్సుఁడు, హ్రృషీకేశుఁడు.

సీత—అయ్యలారా! ఆయోధుని రథమెంతదూరము పోయె?

శ్రీవ—ఇప్పుడే పోయెను. మేముపాఱి వచ్చితిమి.

సీత—ఆయశ్వమేరాజుది? వెంటనెవరు వచ్చియుండిరి.

హ్రృషీ—ఆరాజుపేరు చాల పొడువుగా వ్రాసియుండిరి జ్ఞాపకములేదు, వచ్చిన సేనాధిపతియు తనపేరు చెప్పలేదు.

శ్రీవ—అమ్మా! మేమెంత చెప్పినను నీకుమారుఁడు వినఁడయ్యె. తన పట్టు వదలఁడయ్యె.

హ్రృషీ—సీతమ్మా! మాతప్పేమియు లేదు.

సీత—నాయనా! మీరేమిచేయఁగలరు! హా! తనయా! నీవీ యీడున కే రణమొనర్చితివా? పిల్లవాఁడై యొకవేళ మూర్ఛముపట్టిన

పెద్దవాఁడయ్యు వచ్చిన యోధుఁడు జాలిఁగొన లేదా! అయ్యో! ఎంతకఠినచిత్తుఁడు? పుత్రా! ఇఁకముద్దుగా నాతోఁబలుకు వారె వరు? నాకొప్పున విరులఁ దురుము వారెవరు? నాకు ఫలములఁ దెచ్చియిచ్చువారెవరు? నాప్రియనందన! గుఱ్ఱము కావలెనని కోరుచుంటివే! గుఱ్ఱమే నీకు మృత్యుకారణ మాయెనా? నీయట్టిధీరుఁడు నీయట్టివన్నెలాఁడు నా బోఁటి నిర్భాగ్యురాలికి దక్కునో! అన్నా! నాగర్భమున నేలజనించితివి. సుకృతాత్ముల కడుపులఁ బుట్టవైతివే! ఈవ్యసనము ఘటింపఁజేయుటకేనా నాకుఁ గలిగితివి. నా దుఃఖపరంపరలలో నీపుత్రశోకము కూడ నానొసట వ్రాయఁబడియున్నదా! అకటా! నే నెట్టి పాపరాశిని? సకల సుందరీ సందోహమున నాయట్టి మందభాగ్య యీవసుంధర యందుఁ గలదా? హాదుష్టవిధీ! నీకు నాపై నెంత చలమున్నదో తెలియదు, అయ్యో! నాముద్దుకుఱ్ఱా!

సీ॥ సవనాశ్వ మిదియని చక్కఁగా నెఱిఁగియుఁ
బట్టంగ మననేల పుట్టెనయ్య
పుట్టెఁబో చెలికాండ్రు బోధించు మాటల
నైన నెందుకు వినవైతివయ్య
వినలేదుపో యొక వీరునిఁదాకంగ
నెట్టిసాహసత పూనుకట్టితయ్య
పూనుకట్టితివి పోయిరశక్తి నూహించియుఁ
బోఁకుమానని దెంత బీరమయ్య
గీ॥ పాడుగుఱ్ఱమెచటనుండి వచ్చెనయ్య
యెట్టిదుర్వేళనిలుఁబాసి యేగితయ్య
యకట నాకూన నాదు సుఖాంబురాశి
లపనవిజితరాకాచంద్ర! లవకుమార!॥

ఓ మనోనాయక! నీవుపుణ్యాత్ముఁడవు. నీకీసంకటము లేదయ్యా. నీవు పుత్రోత్సవము నొందలేదు. పుత్రశోకమును జెందలేదు. అన్నియునాకే ప్రాప్తించియున్నవి.

గీ॥ అడవిఁ ద్రోసితివైన నాయిడుమలందె
చిఱుతలనుగాంచి కష్టముల్ మఱచియుంటి
నట్టి నాకిప్పు డిది యొక పెట్టిదంపు
జిచ్చుబుట్టెను గతియేమి? చెప్పుమ నాథ॥

(అని మూర్ఛిల్లును.)

వ్యాఘ్ర—అయ్యో! ఈమెమూర్ఛిల్లె! ఎంతకష్టమెంతకష్టము!

శ్రీవ—వ్యాఘ్రకేశా! ఏమిచేయనగును? నీవుపోయి మనయమ్మగారిని పిలుచుకొనివచ్చెదవా? (అని విసరుచుండును.)

ప్ర—కుశుఁడు, మృత్యుంజయుఁడు.

కుశుఁడు—శ్రీవత్స! మాతల్లి యిటు లకాలమునబరుండియున్న దేల? నీవే లవిసరుచున్నావు? మీమొగములు పాడఱియున్న వేల? నాతమ్ముఁడేడీ?

శ్రీవ—అయ్యా! కుశకుమారా! ఏమనిచెప్పుదుము? నేనును వ్యాఘ్రకేశుఁడు, లవకుమారుడు పుష్పసమిధల నిమిత్తమైయుత్తరపుదెసకు పోయి యుంటిమి.

కుశు—ఔను.

శ్రీవ—మేము కొంచెపుసేపచట వనమున విహరించుచుండఁగా నొక యజ్ఞాశ్వమువచ్చెను, దానిని మీతమ్ముఁడు పట్టికట్టెను.

కుశుడు—ఆ! బాగు! తర్వాత?

మృత్యుం—యజ్ఞహయము నెందులకుఁబట్టెనురా? ఏరాజువిడిచియుండు నదియో?

వ్యాఘ్ర—తర్వాత క్షణమునకు నిద్దఱుభటులు దున్నపోతులట్టివారు వచ్చి విడుమని ప్రార్థించిరి.

మృత్యు—విడువలేదా! యేమి?

వ్యాఘ్ర—నీతమ్ముఁడు గుఱ్ఱమును విడువక తనబాణమును విడువఁగా నందొకభటుఁడు, తనప్రాణమును విడిచెను.

కుశ—బళీ! సోదరా! పిమ్మట?

మృత్యు—అయ్యో గ్రహచారమా?

శ్రీవ—పిమ్మటనొక వీరోత్తముఁడువచ్చి మిక్కిలి వేడెను. లవకుమారుడణుమాత్రము వెనుదీయక పోరగడంగె. అయశ్వరక్షకోత్తముని చాలనొప్పించె. తుదకతఁడు పెద్దవాడగుటచేతను రణవిశారదుఁడగుటచేతను లవకుమారుని గెడిపి వెంటదీసికొనిపోయె. హయమును దోలుకొనిపోయెను. ఈయుదంతముంజెప్పఁగా సీతాదేవి వ్యసనమున నిట్లుపడియున్నది.

కుశు—హా! తమ్ముడా! లవా! శత్రునిచే బడితివే?

కుశు—అయ్యా! రథము పోయి యెంతకాలమయినది?

వ్రాపీ—ఇపుడే, ఒక యఱ క్రోశము పోయినదో లేదో.

కుశు—అమ్మా! అమ్మా! సీతాఅని లేపును.

సీత—(లేచును) హా! తండ్రి లవా?

తే॥ గీ॥ లలితగుణగణాలంకార! లవకుమార
లపిత జితసుధాధార యోలవకుమార
లంబదోర్లతాసార! యోలవ కుమార
లక్షణాకార నాముద్దు లవకుమార॥

(కుశునిచూచి) పుత్రా! కుశా! (అని కౌగలించిదుఃఖించును.

కుశు—తల్లీ! వృత్తాంతమంతయువిన్నాను. నీవువ్యసనపడకుము. ఇది వ్యసనమునకువేళగాదు, శీఘ్రముగ నాకనుజ్ఞనిమ్ము. కార్యము మించిపోవుచున్నది. నీ కుమారుని దెచ్చి నీకప్పగించెదను. వానితో కలిసి పోవక వేఱొకచోటికిఁబోయియుంటిని నాతప్పు క్షమింపుము. నేనే వాని చెంత నుండిన నిట్టి మోసము పుట్టి యుండునా? ఆశత్రువును నీయడుగులకడకీడ్చుకొనివచ్చియుందు.

సీత—నాయనా! నీవును బోయెదననుచున్నావా? పోవలదు. నామాట వినుము. ఇది యుద్ధప్రసక్తి. మనకు శని ప్రవేశించినాఁడు

కుశు—అమ్మా! ఇట్లన్న నెట్లు! పుత్రశోకమున నీ విటులనే పరితపించుచుండెదవా? నీకాఁ గొడుకు వలదా? నాతమ్ముడు పగతునిచే బడియుండ నేను పిఱికినై యింటఁ గూర్చునియుందునే?

సీత—తండ్రీ! నీ సహోదరుని దోడ్కొని వత్తునని నమ్మియున్నావా? అక్కార్యము సులభమైనదియా? ఒక యోధుని పాలఁబడినాఁడే. అతనిఁ జయింప నీకు దరమా? నీవును రణమెఱుంగని బాలుఁడవేకదా?

కుశు—అమ్మా! నీవంతయే తలచి యున్నావా?

ఉ॥ యోధుఁడుగాని, వాఁడు సమరోగ్రుఁడునై ననుగాని, ప్రాణులన్
బాధనొనర్చునట్టిసమవర్తియుగానిజగంబు నేర్చుగా
రీ ధవుఁడైనగాని, యెదిరించిమదీయ వినూత్నబాణ వి
ద్యాధికతం గనంబఱచి యా లవు దెచ్చెదఁ జూడుమమ్మరో॥

సీత—పుత్రరత్నమా! నీ దిట్టతనమునకు సంతసమగుచున్నది. కాని నిను బొమ్మననాకు నోరాడకున్నది. పోవలదుసుమా. నీ వొకఁడయిన నాకుండవలదా?

కుశు—జననీ! నీ వీ విధమున నేల భయపడెదవు?

చ॥ కఱచితినే సవిత్రి! ఘనకార్ముకవిద్యను ఖేలనార్థమై
మఱచితె! నేను బుట్టినది మానితరాజకులంబటంచు? నీ
వెఱుగవె క్షాత్రధర్మము? మునీంద్రుఁడు నేర్పినవిద్యకీర్తియే?
కుఱఁగటనిల్తునే యరికి? గూరిమితమ్మునిఁ నిచ్చి పందనై॥

నేను నీయొద్దనే పుత్రికవలె కూర్చునియున్న నీకు సంతోషమా? ఇట్టి సమయమున నపకీర్తి కాదే. నాతండ్రివార్తవిన్న నన్ను మెచ్చునా? కొఱగాని కొడుకు నగునును గదా? నాతమ్మునిఁదెచ్చినపుడుకదా నేను పుత్రరత్న మగుదును. కావున శత్రువుని జయించి నీపుత్రుని గొనివచ్చెద నొండె లేకున్న వాని తోడి లోకమునకుఁ బోయెదనొండె. జాగు సేయక నాకు సెలవిమ్మ. నన్నాశీర్వదింపుము.

సీత—అహా! నాముద్దులయ్యా! నా ప్రియతనయా! ఈ ప్రాయముననే యెంత నేర్చితివయ్యా? నీయొక్కొక్కమాట యొక్కొక్కలక్ష సేయు. నీతోఁ బ్రతిభాషింపనేర అక్కటా! క్షత్రియధర్మ మెంతనిర్భరము! కుమారా సుఖముగాఁ బోయిరమ్ము. నీతమ్మునితోఁగూడి

సంతోష మొప్ప నను గాంతువుగాక! మీయట్టిబాలురతో సం
గ్రామ మొనర్చు నెట్టివారికినిఁ బరాజయమే యగుఁగాక!
చ॥ సురదనుజాళికిం దురము ఛొప్పడువేళను దేవమాత యే।
వరములనిచ్చె నింద్రునికి బల్లిదుఁడై న ఖగేశ్వరుఁ సుధా।
హరణనిమిత్తముం బనుచు నాతనితల్లి యొసంగె నెట్టివా।
వరముల నట్టి వన్నియును బాలక! నీకు ఘటిల్లుఁగావుతన్॥
కుశు—తల్లీ! సంతసమయ్యె, ఇదె నమస్కరించు చున్నాను. నీయాశీర్వ
చనప్రభావమువలన మూఁడులోకములనైనను క్షణములో
జయించివచ్చెదను. అయ్యలారా! పోనమురండు, సమరస్థలమును
జూపుఁడు.

సీత—ఆహా! తనయా! ఎంత నిక్కచ్చియొనర్చి నాయనుమతి నొందితివి?
దైవమా! నానుతులు సురక్షితముగా ననుఁజేర ననుగ్రహింపుము.
(నిష్క్రమణ)

అరణ్యము - యుద్ధప్రదేశము - కుశాదులు.

కుశు—శ్రీవత్స హ్రాషీకేశులారా! ఇదియేనా పోరు జరగిన తావు.
శ్రీవ—ఔనిదయే,
కుశు—రథ మేవై పునకుఁ బోయె?
హ్రాషీ—ఇటులే యుత్తరమున కరుగుచుండె.
మృత్యు—అల్లదిగో అదియేనా?
కుశు—మీరిందే యుండుఁడు. నే నరదమును ద్రిప్పించికొని వచ్చెదను.
(అని లోపలికిఁ బోయి) ఓయి వీరుఁడా! ఓ యశ్వరక్షకుఁడా!
ఓ క్షత్రియోత్తముఁడా! త్రిప్పుము నీ రథము. నన్ను జయించి
నీ యశ్వమును దోడ్కొనిపొమ్ము.

(పునః ప్రవేశము.)

అతఁడు రథమును మరలించుకొని వచ్చుచున్నాఁడు.
శ్రీవ—కుశకుమారా! అతఁడు బలవంతుఁడుగాఁ దోఁచుచున్నాఁడు. నీ
వొక్కడవే!

కుశు—నే నొకండనైన నాచేతి నారాచము లసంఖ్యాకములని తెలి యవా? ఇపుడు చూచెదవు లెమ్ము.

(ప్ర॥ శత్రుఘ్నుఁడు, భటులు, హయము.)

శత్రు—బాలకులారా! ఎవరు నన్ను మరలించినవారు!

కుశు—నేను నిలిపినవాఁడను. నాతమ్ముని నాయశ్వము నక్కడ విడిచి పెట్టి యిమ్మట మాటలాడుము.

శత్రు—ఓహో! నీ వితని యన్నవా? (స్వ॥) ఆహా! ఈ బాలు రిరువురు నెంత ముద్దుగా నున్నారు. ఇద్దఱు నొకటిగానే యున్నారు. ఆజానుబాహులు, విశాలవక్షస్కులు, నున్నతభుజులుగా నుండు టచూడ మహారాజలక్షణములఁ గలవారుగా నున్నవారు. అయ్యో! తమ్మునియెడ ననురాగమున నాతురుఁడై వచ్చి యున్నాఁడు. అయ్యా! మీా రెవరికుమారులు?

కుశు—నీ భాషామంజరి విప్పకుము. తొలుత నాతమ్ముని నా కప్ప గించుము.

శత్రు—జయధ్వజా! ఆబాలుని నిట దించుము.

(జయధ్వజుఁడు లవుని క్రింద నుంచును)

కుశు—(లవునియొద్దకుఁ బోయి) హా! లవా! నేఁడు నన్ను విడిచి యొంటరిగా నిక్కడ వచ్చితివి? నేను చెంతనుండిన నీ కిట్టిపాటు వాటిల్లి యుండునా! అంబ నీకై మిక్కిలి పొక్కుచున్నదే! లెమ్ము! నాతోడ మాటాడవేల? నాపైనిగోపమా? తమ్ముఁడా! గుఱ్ఱము కావలెనని కోరుచుంటివే! గుఱ్ఱమునకై పోయి యీపాటు దెచ్చు కొంటివే! ఎంత వీరుడవన్నా! నిన్నుఁ దోడ్కొని వచ్చెద నని జనని యెదుట బౌరుషాలాపములఁ బల్కితినే? ఇట్టి నిన్నా తల్లియొద్ద కెట్లు కొనిపోదును?అకటకటా! (అని కన్నీరు నించి) (క్షణమునకు తేచి)

(శత్రుఘ్నుఁ జూచి)ఓ! క్షత్రియప్రవరా! ఈ వడుచువాని నీవే వడువున గెడిపితివి? అశ్వము దక్కఁ గొంటివే? నీ శౌర్యత్వ మిప్పుడు చూచెదగాక!

తమ్ముఁడా! లెమ్ము నాకుఁ దోడ్పడుదువు.(అని యంజలిఘటించి,)

క॥ శ్రీవాల్మీకి పదాంబుజ
సేవంగడుభక్తితోడ సేయుదు నేనిన్
భావింప నతని వాక్కులు
పావనములయేని లవుడు బడయుం దెలివిన్॥

లవుడు—(లేచుచు) వీరవరా! నిలువు మెందుబోయెదవు (అని యన్నను జూచి) అన్నా! నీ వెప్పుడు వచ్చితివి? నన్ను లేపినది నీవయేనా?

కుశు—ఔను. కొంచెము కూర్చుని నీయలసట దీర్చుకొనుము.

శత్రు—అహా! ఈకుమారులు సామాన్యులుగారు. దేవాంశ సంభవులుగా నున్నారు. అన్నదమ్ము లిట్లుకదా యుండెదరులఁ బ్రేమింపుచుండవలయును. వీరిని గన్న మహానీయు లెవ్వరో తెలియకున్నది. అడిగినను జెప్పరు.

కుశు—శూరోత్తమా! నీయశ్వము? నికదోలుకొని పొమ్ముచూచెదను.

శత్రు—అయ్యారే! కుమారా!

లవు—అన్నా! నాచేతి విల్లెచటనో పడిపోయిన దెట్లు?

కుశు—నీ వింతకుమున్ను శ్రమజెందియున్నావు. విశ్రాంతి దీసికొనుము.

లవు—వలదు. నీరాకవలన నా కుత్సాహ మినుమడించె. ఈ హాయమును నీయోధుని నేన సాధింపవలతు. నీ చాపము నాకిమ్ము

కుశు—వలదు. మనవంశకర్తయగు సూర్యభగవానునిఁ బ్రార్థింపుము. దివ్య ధనుర్బాణముల బ్రసాదించును.

శత్రు—ఆహా! వీరును సూర్యవంశపు బుడుతలా? కనుకనే యిట్టి ప్రతాపము బొడగట్టుచున్నది,

లవు— గీ॥ కోలము మన్నిఁడ వేవెలుంగులదునీడ

యేడు బాబాలతేరిపై నెసఁగువాఁడ
ముజ్జగంబుల కన్నయి బ్రోచువాఁడ
విల్లునమ్ములు నీయవే వేడువాఁడ॥
(పైనుండి ధనుర్బాణములు పడును)

శత్రు—(స్వ) ఔరా! యీకుఱ్ఱవాండ్రచరిత్ర చిత్రముగానున్నది. ఏ రస హాయశూరులుగా నున్నారు. బాలకులారా! సార్వభౌముడంపిన యజ్ఞాశ్వమును మీ రిట్లు సాధింపవలెనని రిత్తకోర్కెల గోరుచు న్నారు. వలదు సుఁడీ! ఇది పెద్దకార్యము, మీ రలంతులరు. ప్రమాదము వాటిలు. ముమ్మాటికిఁ జాటిజెప్పెదను,

ఆ॥ కుఱ్ఱవాండ్రు మీరు, ఘోరకార్యంబిది
పూననౌనె శక్తి పోలదయ్య
యలఁతి యెలుకలెందు నంభోధిదాఁటంగ
నగునె యింతమాత్ర మరయవలదె॥

కుశు—ఆ॥ వె॥ నీకుఁదోచినట్లు నీవు చెప్పఁగవచ్చు
బలుకు నాది వినగవలయు నీవు
యలఁతి యెలుక కాదె యల యేనుఁగు మొగంబు
దేవరను వహించి తిరుగుచుంట॥

శత్రు—స్వ॥ వీరు చదువరులు. ఎతిరునఁబల్కిన నందుకు మాఱుబల్కు చున్నారు. ఓరీ! కుఱ్ఱలారా! ఈయుద్ధవిషయము మీకు తెలి యదు. మీ రింకను నాఁటలాడుకొను వయసువారు. నామాట వినుఁడు.

లవు—నీ వీపాటి మాటలాడవచ్చినాఁడవా? నీ ఘోటకమును గొని పోవవచ్చినవాఁడవా? ఇందులకేనా మీరాజు నిన్నుఁ బంపియుండు నది? (కుశునిఁ జూచి) అన్నా! ఇతఁడు మూరక మాటలఁ బ్రొద్దు పుచ్చుచున్నాఁడు. మనము కొట్టినగాని చుఱుకుగొనఁడు. (శత్రుఘ్నుఁ జూచి) అయ్యా! ఇదిగో! ఈబాణముతో మాట లాడుము. (అని బాణమును వేయును)

కుశు—ఇదిగో! ఈశరమునకు నీసామెత్తలఁ జెప్పుము.

శత్రు—(స్వ) వీరు మూర్ఛమువహించియున్నారు. నన్నూరక నొప్పించు చున్నారు. ఇఁక మెత్తనిమాటలు పనికిరావు. (ప్రకాశముగా-) బాలకులారా! మిమ్ముఁ జూచి బాణప్రయోగముం జేయఁ జాలకయుఁ జిన్నవాండ్రగు మీతో సమరమొనర్ప లజ్జజెందియు నూరకుంటిని. ఇఁకఁ జూడుఁడు. లవణాసురప్రాణానిలపర్వీకరంబు లగు మదీయఖరతరశరంబుల మీ యురంబులఁ బగులవేసెదను.

కుశు—ఆశరంబుల నస్మచ్ఛరాగ్నిహోత్రున కాహుతిఁ గావించెదము.

శత్రు—అయినఁ జూడుఁడు. (అని యుభయులు బాణములఁ బ్రయోగింతురు.)

ఓరీ! కనిష్ఠులారా! మదీయ పటిష్ఠముష్టిపరిచ్యుత నిష్ఠుర మార్గణములచే మీ చేష్టల నుడిగించెదఁ గనుఁగొనుఁడు.

లవు—వీరపుంగవా! నింగి మానిక మొసంగిన సింగాణినుండి వెడలం గెడు. నింగలపుఁ ములుకుంగమి నీమెయిం గాడనేసెదము, కనుంగొనుము

శత్రు-ఉ॥ డింభకులార! మోసముసుఁడీ యిదె వైచెద వారుణాస్త్రముం
కుశు—దంభము లేల? దానిఁ బడఁదన్నఁగ లేదె సమీరణాస్త్రముం
శత్రు—గుంభిని మిమ్ము నిర్వురను గూలఁగఁ గొట్టెద నీక్షణంబునన్
లవు—శంభుఁడు తోడువచ్చినను సాగదు నీశపథంబు వీరుఁడా॥

(కుశునిఁ జూచి) అన్నా! ఇతఁడు సర్వాస్త్రవేదిగా నున్నాఁడు మోసమగును. శీఘ్రమునఁ బడవేయనగును.

కుశు—అటులే కానిమ్ము శూరుఁడా! ఇదే నాయస్త్రము చనుదెంచు చున్నది. ఎదుట నిల్వఁజాలవు. వెనుకకుఁ బరుగెత్తుము.

ఆ॥ వె॥ నాదు తండ్రి సత్యనైష్ఠికుండగునేని
జనని, లోకవిదిత సాధ్వియేని
పరఁగ వామలూరుభవుని శిష్యుఁడ నేని
పగతుఁ డీ శరమునఁ బడెడుఁ గాక॥

(అని కుశుఁడు బాణమువైవఁగా నది మిక్కిలి ధ్వనితో శత్రుఘ్నునిపైఁ బోవ నతఁడు! హా! హా! హా! అని వెనకకుఁ బాఱుచుఁ దెరలోఁబడును. సైన్యము "హా! లవణాంతకా! అని పాఱిపోవును—గుఱ్ఱము బెదరిపాఱును.

శ్రీవ—బళీ! కుశకుమారా! ఎంతటియోధునిఁ గెడిపితివయా?

వ్యాఘ్ర—కుశలవులారా! అదిగో తురంగము మీబాణధ్వనికి బెదరి పాఱుచున్నది.

కుశు—పట్టుకొని వత్తము, రండు.

లవు—నాలుగువైపులఁ బోదము. దీనిని విడువఁగూడదు సుఁడీ! పరువెత్తుఁడు.

(అని నిష్క్రమింతురు.)

—(౦)—

ఇది పంచమాంకము.

# రామకుమారాభ్యుదయము.

## షష్ఠాంకము.

అరణ్యము—యుద్ధభూమి.

ప్రవేశము: లక్ష్మణుడు సైన్యము.

లక్ష్మ—హా! శత్రుఘ్నా! నేఁ డెట్టి దుర్దినము? లవణాసురుని యసువుల నిముసమున హరించిన నీదగు నసదృశభుజశక్తి వమసెనే! సమరతలమ్మున లక్ష్మణుఁతమ్ముఁడవే నీవని యన్నగారు నిన్నెన్న గాఁ గర్వించితినే! అన్నా! అట్టివాఁడవు బాలకులచే బడితివే! ఎంత యక్కజముగనున్నది? వా రెట్టిబాలురు? తమ్ముఁడా నీ సుద్ది విని యచట నందఱు కడు దీనత వందురుచున్నారు. యజ్ఞకార్యమంతయు భంగమాయె. తల్లియగు సుమిత్రాదేవి నేల బట్టి పెల్లు దురపిల్లుచున్నది. యాగశాలయంతయు నిర్విణ్ణతఁ జెందియున్నది. అన్నగార్లిరువురు మూగలై దుఃఖించుచున్నారు. బంధుమిత్రాదు లెల్లరు నాశ్చర్యనిమగ్నులయినారు, అన్నా! ఇన్ని దేశములఁ దిరిగి జయధ్వజమెత్తివచ్చి యీపర్ణశాల బాలురచే నోడితివే? అక్కటా! ఏమిదైవవిచిత్రము?

ఉ॥ సోదర! పట్టణం బెటులఁ జొత్తును నిన్నిటనీగి తల్లి నే
మాదిరి నూఱడింతు? గుణమాన్యకు నీసతి కేమి చెప్పుదుఁ
గాదిలియన్న గార్ల పదకంజయుగం బెటుపోయి కాంతు? నిం
కేది తెఱంగు? నీబదుకు నేక్రియజూతునొ యేమి సేతునో

అక్కటా నీకెట్టి బలముతక్కువయ్యె? ఎట్టి గ్రహబలము చాలకపోయె. ఏదేవత లడ్డపడెఁ? ఎవరిశాపము సంభవించె? ఏమి మోసము సంఘటించె?

ఉ॥ విప్పుదునే యముండు విలవిల్లిలఁ దన్నుకొనంగ మహాస్త్రముం గ్రొప్పుదునే ధరాతలము దిద్దిరసంద్రములో మునుంగఁగఁ గప్పుదునే శరంబుల వికర్తనమండల మెల్లఁ జీఁకటిఁ రొప్పుదునే సురాళి నినుఁ బ్రోవఁగ వచ్చెదుదాక తమ్ముడా! ॥

జయ—ఆర్యపుత్రా! శాంతి నొందుము. ఇట్లు చింతించిన నేమి ప్రయోజనము ఇది సమరస్థలము. కార్యగతి నరయఁదగును. ఆ బాలకులును హయమును గాన్పింపలేదు. ఇందెందున్నారో చూతము.

ప్ర॥ శ్రీవత్సుడు, మృత్యుంజయుఁడు.

లక్ష—చిన్నవాండ్రారా! మీరేనా మా హయమును పట్టియున్నది.

శ్రీవ—ఔను. మేమే.

లక్ష్మ—మీ రెవరు?

మృ—మేము ఋషిపుత్రులము.

లక్ష్మ—మా యశ్వ మెక్కడ

శ్రీవ—మా పర్ణశాలయొద్ద మేయుచున్నది.

జయ—(లక్ష్మణునితో) స్వామీ! మన గుఱ్ఱమును బట్టినవారు వీరు కారు, ఆ కుమారులు తమ నెలవునకుఁ బోయియుండవచ్చును.

లక్ష్మ—(సరియే) అని— (బాలకులఁ జూచి)—మాయశ్వమును విడిచెదరా లేదా!

మృ—విడుచుట లేదు, గిడుచుట లేదు.

లక్ష్మ—ఏమి? విడువరా? జయధ్వజా! వీరల నా చెట్టునకుఁ గట్టుము.

(జయధ్వజుడు బాలకులను బట్టుకొనును)

శ్రీవ—మేముకాదయ్యా! మేము కాదయ్యా! ఊరక చెప్పితిమి.

మృ—మేము బ్రాహ్మణులమయ్యా! మాకేల గుజ్జములు.

లక్ష్మ—అటులయిన నీ యశ్వమును బంధించిన మీ సఖు లెవ్వరో వారిని బిలుచుకొని వచ్చెదమన్న విడిపించెదను. లేకున్న మీరు పరిహాస మొనర్చినందులకుఁ దగిన శిక్షగావించెదను.

శ్రీవ—నిశ్చయముగాఁ దోడ్కొని వచ్చెదము. మహారాజా!

లక్ష్మ—అట్లు ప్రమాణము చేయుడు.

మృ—మా గురువుసాక్షిగాఁ బిలుచుకొని వచ్చెదము.

లక్ష్మ—జయద్ధ్వజా! వీని వదలుము.

శ్రీవ—బ్రతికితిమిరా బడుగుజీవుడా!

మృత్యు—నిమ్ముఁ దాకు పొట్టేళ్లను బట్టుకొని వచ్చెదము, తాళుడు.

(నిష్క్రమింతురు)

(పునఃప్రవేశము మునికుమారులు కుశలవులతో)

లక్ష్మ—(స్వగతము) ఆహా! ఈకుమారులు మా సవనాశ్వమును బట్టి యుండ నోపుదురు. వీరు మునికుమారులుకారు. మునివేషముల నున్నను క్షత్రియకులజలధికళానిధులుగా నున్నారు. మహారాజ లక్షణములగు విశాలనేత్రములు, నెగుబుజంబులు, వెడంద రొమ్ములు, మోకాటిబంటి చేతులు గలిగియున్నారు. పోల్చి చూడ వీరి యాకార మంతయు మాయన్న రామభద్రునిఁ బోలి యున్నది. ఇఁక ముఖవికాసముఁ దిలకింప సంపూర్ణముగా మా వదినె గారిని దలపించుచున్నారు వీ రెవ్వరై యుందురు?- సీతాదేవి కన్నకొడుకులై యుందురా? ఆతల్లి నీ వాల్మీకి యాశ్రమ భూముల నా నాఁడు డించిపోయి యుంటి. ఆమె యిందెందైన నీయమడలఁ గాంచియుండునా? రాకొమరులకుఁ దప్ప బ్రాహ్మణబాలకుల కిట్టి విక్రమము పుట్టునే? వీరినిఁ బ్రశ్నించి తెలిసికొనెదగాక! (కుశలవులను చూచి) కుమారులారా! మీ రెవరు?

కుశు—మా స్నేహితులను జెట్లకుగట్ట మిమ్ము జూడవచ్చినవారము.

లవు—ఒకవేళ మీరు బంధించిన యెడల విడిపింపవచ్చినవారము.

లక్ష్మ—(బలీ!) అయ్యో! మీ మిత్రు లబద్ధములాడవచ్చునా?

కుశు—ఒకయెడ హాస్యమునకై యాచితయెడల భూదేవులనుగట్టివేయు వాఁడవా? నీవు క్షత్రియ ప్రవరుడవేనా?

లక్ష్మ—మీరును క్షత్రియులా?

లవు—కాదను వా రెవరు? అందులకు మీ యజ్ఞాశ్వమే సాక్షి.

లక్ష్మ—మీరు వాల్మీకిమహర్షి శిష్యులరు కదా?

కుశు—ఔను శిష్యులమును మనుమలమును.

లక్ష్మ—మీతలిదండ్రు లెవరు?

జయ—ఆమాటయే చెప్పరు,

లవు—అవన్నియు నీకేల? మాతో సంబంధము సేయవచ్చిన వాఁడవా? నీ యజ్ఞహయముకొఱకు వచ్చినవాఁడవా?

వ్యా—మమ్ములనుఁ జెట్లకుఁ గట్టుటకు వచ్చినవాఁడవా?

లక్ష్మ—అటు కాదు.

క॥ గర్వంబున వీరుడు తన
పేర్వాడుచు బుట్టు దెలిపి, భీషణసంగ్రా
మోర్విని బోరుం గావున
హర్వుగ మిముఁ దెల్పుకొన భయంపడ నేలా?

వ్యాఘ్ర—భయమేమి చెప్పఁడు.

లవు—అయినఁ జెప్పెదవినుము.

ఆ॥ వె॥ మహిత సాధ్వి యమరు మాతల్లి సీతమ్మ
తండ్రి, రామభద్ర ధార్మికుండు।
కుశు— నేను కుశసమాఖ్య నెసఁగుదు వీఁడునా।
యనుజుఁడైన లవ సమాహ్వయుండు॥

లక్ష్మ—(విల్లునమ్ములఁ గ్రిందబెట్టివైచి) (స్వ॥) ఆహా! నే ననుకొన్నటులే యయినది. ఆయశ్వముఖమునఁ గట్టిన పట్టికయందలి నామాంకితుఁడే తమ తండ్రియని యెఱిఁగినవారు కారు. లేకున్న నీశత్రుఘ్నునిఁ బూజించి యుండరా? గుఱ్ఱముజోలికి వచ్చియుందురా? ఎంతముద్దుగా నున్నారు! ఎట్టి చదువరులు! ఎంతటి

ధీరులు! నేఁడెట్టి సుదినమో తెలియదు, శ్రీమదయోధ్యానగర
భద్రసింహాసనార్హులగు శ్రీరామచంద్రాత్మజులఁ గంటిని. ఇట్టి
భాగ్యసంపన్నులిట్టి సుకుమారులీయరణ్యములఁ బెరుగుచున్న
వారా! అయ్యో! దైవమా! నే నిప్పు డేమి చేయనగును?

కుశ—అయ్యా! శూరుఁడా! మా పేళ్లను వినినయిమ్మాట నేమియో
వ్యాకులము చెంది యున్నావేల? ఇదియేనా నీ శూరత్వము?

లక్ష్మ—అయ్యలారా! మా వదినె యొకర్తుక యుండె. ఆమె పేరును
సీతమ్మయే. ఆజనని యిపుడు దేశాంతరమున నుండుటచే జ్ఞాపక
మునకు వచ్చి వ్యసనమగుచున్నది. అది యట్లుండనిండు. మిమ్ము
చూచినతఱినుండి యుద్ధ మొనర్ప బుద్ధి పుట్టకున్నది. మాపుర
మునకుఁ బోగము రండు. మారాజు మిమ్ముం గాంచి సంతోషిం
చును. అదియునుగాక

క॥ ఇప్పించెద మణిభూషల ।
మెప్పించెద జేనిచేత, మేలగు వలువల్ ।
గప్పించెదఁ గోఁటనయొడఁ
దెప్పించి యొసంగువాఁడఁ దేజీ లైనన్॥

కుశ—అయ్యా!

గీ॥ బూదిబూసెడువారికి భూష లేల ।
మహిని మునులకు రాజుల మన్న నేల ।

లవ— వల్కలంబులె చాలు, నీ వలువ లేల ।
పిఱికిఁదనమున మిమ్ముల వేడనేల॥

లక్ష్మ—(స్వ॥) ఆహా! కడు బుద్ధిశాలురుగా నున్నారు. కుమారులార!
మీరు పిఱికివారలుకారు, ధీరులే యగుదురు. నేనే పిఱికివాఁ
డను. దయచేసి మా యశ్వమును వదలుఁడు. త్వరలో పట్టుకొని
పోవలయును. యజ్ఞకార్యము భంగమగును.

కుశ—ఓహో! నీవు కార్యసాధకుఁడవుగా నున్నావు. మమ్ముల మోస
పఱచి హరిని హరించికొని పోవవలెనని యున్నావా. చూడఁగా

మహావీరుఁడవుగాఁ గాన్పించుచున్నావు పిఱికేఁదనముఁ గప్పుకొనె దవేల?

లవు—అయ్యా! నీవు వీరుఁడవుకాని, భీరువుకాని మమ్ము జయించియే యశ్వమును గొనిపోవలయు.

శ్రీవ—ఎంతమాత్రము వదలుట లేదు.

హ్యాషీ—దాని తోఁకయైన నీకుఁ జిక్కనీయము.

జయ—బాపలగు మీ కిపుడు బలమెక్కివచ్చెనేమో కద!

లక్ష్మ—బాలులారా! వేఁడుకొన్నను మూర్ఖముబట్టుట ధీరుల లక్షణమా?

లవు—మేము మూర్ఖుల మెప్పటికిని గాదు. ధీరులమే.

కుశు—అయ్యా! నీ వేఁడుకో లేమి? అశ్వము నిమ్మనికదా? నీ యజ్ఞకార్యము భంగము లేకుండ మాతాతగారి నడిగి యేదైన నొకతట్టునుఁ దెచ్చియిచ్చెదము. ఈ పట్టిన గుఱ్ఱమును వదలము.

శ్రీవ—ఔను.

లక్ష్మ—అయ్యా! ఇతరతురగము పనికిరాదు. ఈతురంగమే కావలయు ఇది బిరుదపట్టిక వహించి వచ్చియున్నది.

లవు—ఆకారణముచేతనే దీనిం బట్టియుండినది. వీరమాతకు బుట్టిన వాఁడట, ధీరతఁగలుగువారు పట్టవచ్చునట, మాతల్లి వీరమాత యగునో కాదో, మేము వీరులమా కామో చూడవలెనని యున్నాము,

హ్యాషీ—ఏమందువు?

లక్ష్మ—కుమారులారా! ఆశపథము పెద్దవారగు రాజుల కన్వయించును మీయట్టి చిన్నవాండ్రకుఁ గాదు.

కుశు—మేము రాజపుత్రులము కామా? గుణమునకుఁ బెద్దయేమి? చిన్నయేమి?

ఆ॥ వె॥ గుణముగలుగువాఁడు కొండికయైనను।
బెద్దయగుచు మిగుల బేరుఁబొందు।

గుణము లేనివాఁడు గురువయస్కుండైన ।
చిన్నకంటెఁ జాల చిన్నవాఁడు ॥

లవు—అయ్యా! నేను చెప్పెదను వినుము.

ఆ॥ వె॥ గుణముగలదియగుటఁ గొంచెపు వజ్రంబు ।
వేయిసేయు, మఱియు సేయు లక్ష ।
గుణము లేని పెద్ద గుండొక కాసైనఁ ।
జేయఁజాలదయ్యె! చేయదయ్య ॥

హ్యా—సత్యము.

లక్ష్మ—ఈచిన్నవాండ్రతో నసాధ్యముగా నున్నది. తండ్రిసకల ధర్మ పారంగతుఁడు. తల్లి సర్వధర్మస్వరూపిణి. అటువంటివారిగర్భమున జనించిన యీ సుమకోమలాంగులకు నీతిసౌరభ్యము వెంటనే సంజాతమైనది. ఏమి చెప్పినను బదులుచెప్పుచున్నారు సౌమ్య వాక్యములు పనికిరాకున్నవి. వీండ్రను దారసిల్లుటకు నామన మొప్పకున్నది. వెఱపించి చూచెదను.

అయిన నశ్వమును వదలరా?

కుశు—ముమ్మాటికి వదలము. ఎన్నితూరులు చెప్పవలెను. నీకుచెవుడా?

లక్ష—మీ కపాయము సంభవించును. చక్కఁగా యోచింపుఁడు

లవు—అదెట్టిదో చూడవలెనని యున్నాము.

లక్ష్మ—నే నెవ్వఁడనో యెఱుఁగుదురా?

కుశు—మిక్కిలి వాచాటుఁడవని తెలిసికొంటిమి

లక్ష్మ—ఆహా! అట్లు ప్రేలెదరా?

చ॥ బిరుదుమగంటిమిన్ మెఱయు వృత్రునిఁజంపిన ధీరుఁడౌ పురం ।
దరుని జయించి యెవ్వఁడతి దర్పమెలర్పఁగ నింద్రజిత్తు నా ।
బరఁగెనొయట్టి రాక్షసునిఁ బట్టి జగంబు ప్రశంసఁజేయఁగా
దురమునఁ గూల్చినట్టి మనదోర్బలశాలి నెఱుంగఁ జెప్పెదన్ ॥

లవు—ఓహో! అటులయిన నీ వింద్రజిత్తుజిత్తువా? నిజమే, జిత్తులమారి నక్కవే! కడు యుక్తిమంతుడవు.

లక్ష్మ—కుమారులారా! కుఱ్ఱవాండ్రగుటచే మీ గర్వప్రలాపముల మన్నించినాను ఒండొకపగతుండై యుండిన యెడలనుద్దండరాక్షస శిరఃఖండనపాండిత్య మండనాయమాన మదీయ కోదండవినిర్ముక్తప్రచండకాండతండంబులచే దండధరుని దండ బడి యుండు నాగునదండించియుందు.

హ్రా—కుశలవులారా! గుఱ్ఱమును విడిచిపుచ్చుఁడు.

శ్రీ—ఔను, ఇతఁడుక్కుతునియగా నున్నాఁడు ఇతనితో మనకు గయ్యమేల?

కుశ—అయ్యా! వీరుఁడా! నీ "దండండం" కు భయపడువారము కాము.

ఉ॥ క్షత్రియవంశసంభవుఁడు క్షాత్రముఁబూని రణాంగణంబునన్
శత్రుముఖాముఖి న్నిలిచి చాలఁగఁ బోరును, ప్రాణభీతియే
మాత్రము నొందునే మముఁ గుమారులటంచు గణించుచు న్భవ
చ్ఛిత్రవచోవిభీషణముచే వెఱపించఁదలంచె దేమొగా॥

లక్ష్మ—వెఱపించుటకాదు. నిక్కముగా నొక్కిచెప్పుచున్నాను. బాగుగాఁ దెలిసికొనుఁడు. ఇది యుద్ధరంగము. క్రీడారంగము కాదు.

క॥ చిల్లలు, కట్టెలు లేవిట
నల్లారుగఁ జెలులతోడ నాడుకొనంగా
భల్లంబులు కార్ముకములు
చిల్లులుపడు నొడలు, తెలియఁజెప్పెద వినుఁడీ॥

కుశ— క॥ భల్లములే మా కాడెడు
చిల్లలువలెఁ గలిగినాము చెప్పఁగ నేలా
చిల్లులవిషయం బెట్టిదొ
యల్లదిగో నీదు తమ్ముఁ డరయుం గంటే॥

లవు—ఒడలు చిల్లులుపడునని నుడివెదవా? ఇవిగో పడుచున్నవి, పోఁడఁగనుము. (అని బాణముల వేయును)

లక్ష్మ—ఓరీ! నా యలుగులు వచ్చెను జూడుఁడు, మీరు లెక్కపెట్టఁజాలరు. (అని బాణములు విసరును.)

కుశు—శూరోత్తమా! నీయలుగులను మా ములుకులే లెక్కించు చున్నవి. చూడుము. (అని బాణప్రయోగముచేయును.)

లవు—ఒక్కొకటి రెండుమూడుతునుకలగుచున్నవనికూడ చెప్పుచున్నవి. (అని బాణముల వేయుచుండును.)

లక్ష్మ—(స్వ) అహా! వీరలంతులం బోవువారుకారు. అసదృశమైన బాణ విద్య నేర్చియున్నారు. మంచిమాటలకు లోబడరు. గట్టిమా టలకు భయపడరు. హయమును విడిచిపోవుట యెట్లు? రణ హీనత యగునుగదా? ఈకుమారులను గొట్టుట యెట్లు? వీరు సామాన్యముగా నణగువారుకారు. లోకైకధనుర్ధరుండగు రఘు వీరునికిం దగిన కొడుకులే పుట్టియున్నారు. దైవమా! సంకటము పొసంగె నేనేమి సేయుదును? ఇంక మహాస్త్రమున సంధించి వీరినిం గెడపవలెను. అట్టి పని యొనర్చి సీతారాములకు ద్రోహ ముం జేయంజాల. ఏమిగతి?—(అని యాలోచన నభినయించి) నా కొకటి తోంచుచున్నది. నేనే వీరిచేం బడినయెడల నిక నా యన్నయే యుద్ధమునకు రాంగలండు. తన పుత్రులం జూచి సంతోషపడంగలండు. వీర యుభయుల సమాగమము వలన సీతాదేవియు రాంగలుగును. అప్పు డామెను మా యన్న గారు గ్రహింపవచ్చును. తదనంతర మందఱికి సంతోషమగును. ఇదియే యుపాయము. వేఱు మార్గము నాకుం దోంచలేదు,

ఓరీ! బాలకాధములారా! మదీయ ధనుర్వ్యముక్తాఖర్వపర్వ తాస్త్రము మీ సర్వావయవముల విఱిచి మీ గర్వముల నడంచుం జూడుండు.

కుశు—రానిమ్ము, ఇదిగో వజ్రాస్త్రము సిద్ధముగా నున్నది.

లవు—అన్నా! ఇంక జాగుసేయకుము. ఇతండును మహాస్త్రవేది. శీఘ్ర మునం గెడపనగును.

కుశు—వీరవరా! ఇదిగో, కాపాడుకొనుము.

గీ॥ మా॥ విద్దె బాలకులకు నభివృద్ధిం బొంద
నిలను నిజగురుభక్తియే హేతువేసి।

ధరణీని సకాలవర్షముల్ గురియుటకును
ప్రజలయందలి ధర్మమే వ్యాజమేని।
యెట్టి కష్టంబులును నలయింపకునికి
పుండరీకాక్షు కరుణయే మూలమేని।
ధర్మమే జయమనుట వాస్తవమయేని
కడఁగి యీకోల పగతునిఁ గెడుపుఁగాక॥

(లక్ష్మణుఁడు పడును) (భటులు పాఱిపోదురు.)

అవనికపడును.

(కుశాదులు ముందటికి ప్రవేశము)

మృత్యుం — అరరే! కుశకుమారా!

శ్రీవ — అయ్యారే! లవకుమారా!

వ్యాఘ్ర — అయ్యలారా! మీతల్లి కడుపునఁ బుట్టినందులకు సార్థకమాయె. మావంటివా రెందఱు కలిగిననేమి?

కుశు — విప్రవరులారా! మీ రటులనఁ జెల్లదు. మాకంటె మీ రెక్కువవారలే. ఇది మే మొనర్చవలసిన ధర్మము. మీది కాదు. భూసురశిరోమణు లనుగ్రహించిన విద్యామహిమయేకదా యిది? మీరే పూనినయెడల నింత పదియంతలు మీ ప్రభావమును జూపఁజాలరా? పరశురాముని చరిత్రము మనము చదువలేదా? మీ ధర్మము శాంతగుణప్రధానము. మా ధర్మము శౌర్యగుణప్రధానము,

లవు — అన్నయ్యా! ఆ యోధు లిరువు రెంత చక్కనివారు! ఇద్దఱు నొకటిగానే యుండిరి. కడుచాతుర్యముగా మాటలాడుచుండిరి. రణవిశారదులుగాని సామాన్యులుగారు. వారి వస్త్రాభరణముల చూచితివే? ఎంత నిగనిగలాడుచుండె? కిరీటములేమి, కేయూరములేమి, కంకణములేమి, హారములేమి? ఎన్ని ధరించియుండిరో వారికి బరువుకావేమో?

శ్రీవ — లవకుమారా! రేపు నీవు నొకరాజవైనపుడు వారివలెనే ధరింపఁగలవాఁడవే.

వ్యాఘ్ర—మాకు పవిత్ర మీ విభూతి, రుద్రాక్షలు, కావిబట్టలే గతి.
లవు—అన్నా! మన మింకఁ బోదమా!
కుశు—పోవుదము. హయమునకొఱ కింక నెవరైన వచ్చిన నట్లు?
లవు—వచ్చిన యెడల వారి ధ్వనులు వినఁబడవా? మరలి పోదము.
కుశు—అయిన, పోదము రండు. (అని పోవుచుండఁగా)

ప్ర॥ అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు.

అంగ—ఓ! మునికుమారులార! నిలువుఁడు, మీ రెక్కడకుఁ బోయెదరు? (అందఱు మరలుదురు)
శ్రీవ—అబ్బా! ఎంతపెద్దకోతులురా! ఎంతగొప్పయెలుఁగుగొంతు.
వ్యాఘ్ర—ఔనురా! మనవలెనిలిచి మాటలాడుచున్నవి.
మృత్యుం—కుశలవులారా! నీవనిమాటలాడించుఁడు.
లవు—ఎవరుమీరు?
హను—మేము వానరోత్తములము. ఇతఁడు భల్లుకోత్తముఁడు.
కుశు—అది చెప్పనక్కఱలేదు. చూడగానే తెలియుచున్నది.
హను—ఇతఁడు తారేయుఁడు. ఈతండు జాంబవంతుఁడు నేను పావనిని.
లవు—ఓహో! మీకుఁ బేళ్లునుగలవా? మమ్ము బిలిచిన దెందులకు?
అంగ—మాసవనహయమును మరలించుకొని పోవుటకు
కుశు—మేము పట్టినహయము మీదియేనా?
హను—మాప్రభువుగారిది. మే మతనిబంట్లము.
లవు—మజ్ఝారే! ఈ యశ్వము క్రోతులరాజుదియా! మీ రాజెక్కడనున్నాఁడు.
జాంబ—ఇదే వెనుక నేతెంచుచున్నాఁడు. మున్ను పోయి మిమ్మందఱిఁ గట్టివేయుఁడని యాజ్ఞాపించి యున్నాఁడు.
కుశు—ఏమంటివి! జాగ్రత్తగా మాటలాడుము,
శ్రీవ—అబ్బా! ఈమఖవాజికై నిఁకనెవ్వరెట్టివారు వచ్చుచున్నారో అదిగో వచ్చిరి,

ప్ర॥ రాముఁడు, భరతుఁడు, సుగ్రీవుడు విభీషణుఁడు సైన్యము.

రాము—హా! లక్ష్మణా!

భరత—హా! శత్రుఘ్నా!

విభీష—అయ్యో! సౌమిత్రులారా! మీ కెంతపాటువచ్చె!

రాము—

సీ॥ ఉన్నటు లుండి నే నొనరింపబూనితి
హయమేధ మేలకో యన్నలార।
యజ్ఞాశ్వరక్షణ మది యెంత పెద్ద మీ
కనినమ్మియుంటి నాకనుజులార।
మిముగెల్చు దిట్టలీ మేదిని గలరని
తలపలేనైతినో తమ్ములార।
యింద్రజిల్లవణాసురేంద్రులఁ బొంగొన్న
శక్తులెక్కడబోయె సహజులార।
ఆ॥ వె॥ యకట యెట్టిమోసమాయె, మద్భుజయుగ
బలము బీరువోయె, వాంఛలడగె
జన్న మేలనింక, సౌఖ్యంబులన్మాట
లేల? నేను నేల నేలనేల॥

(అని కన్నీరు నించుచు)

సుగ్రీ—కటకటా! యెంతకష్టము?

భరతు—సోదరులారా! మీరు బాలురచే నోడితిరే? లేక వారినిగొట్ట జాలక మీరే యోడితిరే? అకటా! సుమిత్రాదేవి కిప్పుడొక రైనలేక పోయితిరే? ఆతల్లి శపించిన మాగతియేమి? ఆమెదుఃఖమున కేమి సమాధానమును జెప్పగలము? ఊర్మిళా శ్రుతకీర్తుల నెట్లూరడింపగము? వారికి మామోము లేలాగునఁ జూపఁగలము! అహా! యీ క్షత్రధర్మ మెంతచెడ్డది హా! దైవమా!

విభీ—దేవా! వ్యసనపడకుఁడు. యువరాజాగ్రణీ! ఊరడిల్లుము. మీ తమ్ములు గతజీవులుకారు. ఏదియో మహాస్త్రమున మూర్ఛ జెందియున్నారు. సిమ్మట తెలివొంద జేయనగును. మీరిట్లు శోకించిన తెఱగెద్ది? ఇది రణభూమికదా? పేదమానిసులరై పల్లటిల్లఁ జెల్లునా? దయచేసిలెండు. వచ్చినకార్యగతి నరయుఁడు.

శ్రీవ—(హృషీకేశ మృత్యుంజయులతో) ఓరీ! ఈ రాక్షసునిఁ జూడ నాకు భయమగు చున్నది. మనము చాటున నుండి చూచు చుందము- రండు (నిష్క్రమింతురు)

హృషి—ఔను. నిష్క్రమించును.

లవు—అన్నా! ఈరాజు లెంతవల్లగా నున్నారో చూడుము. మమ్ము బెదరించుటకు క్రోతులను రాక్షసులను, వెలుగులను, బిలుచుకొని వచ్చినారు.

కుశు—అయ్యో! తమ్ముల గూర్చి మిక్కిలి వగచుచున్నారు.

రాము—బాలకులారా! మీరెవరు?

కుశు—మీరందఱెవ్వరు?

రాము—మేము వశిష్ఠమహర్షి శిష్యులము. ఇతఁడు నాతమ్ముఁడు. వీరు నామిత్రులు.

కుశు—మేము వాల్మీకి మహర్షిశిష్యులము. మేమిద్దఱమన్నదమ్ములము.

భరతుడు—మీరెవరి కుమారులు?

లవు—మీరెవ్వరి పుత్రులరు.

రాము—మే మాజి తనూజులము నాపేరు కౌసలేయుఁడు ఇతని పేరు కైకేయుఁడు

కుశు—నన్నుఁ గుశుడందురు వీఁడు లవుఁడనబడువాఁడు. మాతల్లిదండ్రులను జెప్పెదము వినుఁడు.

సీ॥ శ్రీసూర్యవంశాబ్ధి శీతమయూఖుండు
వరకరుణాగుణ బంధురుండు।
నిత్యసత్యవ్రత నిష్ఠాగరిష్ఠుండు
శాంతగుణైక ప్రసన్నమూర్తి।
తతలోకసన్నుత ధర్మస్వరూపుండు
భక్తజనాళి కల్పకనిభుండు।
దుష్టదానవ జీవతూలవాతూలుండు
ఋషి చకోరక గణ మృగధరుండు।

గీ॥ తే॥ నేకపత్నీవ్రతుండు సుశ్లోకుఁ, డంబు।
జాతసదృశకర్ణాంతలోచనుఁడు, ఘనుఁడు।
శ్రీకరాకారుఁడనుభువనైకవీరుఁ।
డైన శ్రీరాముఁడమరుమాయప్ప, ధరణి॥
(రామాదులు అచ్చుపడుదురు)

లవు—
సీ॥ ఏబిడ్డమణివోలె నెలమిఁగల్గుటభూమి
కాంచెనామము రత్నగర్భయనుచు।
నేచానపతిభక్తి నెసలారుకీర్తిని
బొలఁతులపాపట ముత్తియంబు।
నేమానినీశీలమెఱిఁగింపజగమున
కగ్నిహోత్రుండొక యద్దమయ్యె।
ధవునాజ్ఞ నేసతి తలదాల్చిన తెఱంగు
పడతులకొకబడి పాఠమయ్యె।
గీ॥ నక్కజంబగు నోర్పుసంయములకైన
మానితంబగు నుపదేశ మంత్రమయ్యె
నట్టిపుణ్యగుణోపేత యమలచేత
మగువమిన్నయె తగుసీత, మాకుమాత॥
(రామాదులు వ్యసనపడుదురు)

రాము—(స్వ) ఆహా! నాయర్ధాంగలక్ష్మి యీధీరయుగళముం గాంచి నదియా? (అని కన్నీరునించును)

సుగ్రీ—(రామునితో) దేవా! గుఱుతింపమైతిమి.

రాము—(సుగ్రీవునితో, ఊరకుండుము—బాలకులారా! ఈసవనాశ్వము నుబట్టుఁడని మీతల్లిదండ్రులు చెప్పినారా? లేక మీగురువులువారు చెప్పినారా?

లవు—వారెవ్వరును జెప్పలేదు.

కుశు—మీరే చెప్పియున్నారు.

రాము—అదెట్లు?

కుశ—ఆయశ్వముఖమున "బిట్టలగువారు పట్టవచ్చును." అనివ్రాయబ డిన మీవ్రాతవలన.

భర—అది వయఃప్రౌఢిమగల రాజుల కన్వయించును. మీయట్టిచిన్న వాండ్రకుగాదు.

కుశ—మేమట్టి ప్రాయముువారము కాకపోయినను రాజకుమారుల మగుటవలన మాధీరత్వముఁజూప నెంచియున్నాము.

భర—మీరుపసిబాలురే, యుద్ధమున నెట్టిదియో యెఱుగుదురా?

కుశ—ఎఱుగుదుమనియే యెంచియున్నాము.

లవు—అంతసందియమెందులకు ? అదిగో మీతమ్ముల నడుగఁడు చెప్పెదరు.

రాము—మీరుకుఱ్ఱవాండ్రు నామాటవినుఁడు. యుద్ధమటుండనిండు. నాతమ్ములను హయమును దోడ్కొనిపోయెదను. మీరునావెం టరండు నాపురమున—

కుశ—మీతమ్ముల నెత్తుకొనిపోవచ్చును. గుఱ్ఱమిప్పటికి మాదికాని మీయదికాదు. మమ్మునజయించిన మీదియగును,

లవు—మేము నీవెంటవచ్చువారముకాము.

రాము—అటుకాదు. మాపురికి వచ్చినయెడల మీకు దివ్యభోజముల బెట్టించెదను. దివ్యాంబరముల నిచ్చెదను.

భర—మీకు వలయుసన్ని మణిభూషణముల నిచ్చెదము. రథగజతురగములు కోరునవి యొసఁగెదము. తుదకు మిమ్మసింహాసనముల పైని గూర్చునఁజేసెదము.

కుశ—అయ్యా! మమ్ము మోసపుచ్చెదరా?

లవు—లేక యెగతాళిఁజేసెదరా?

కుశ—సీ॥ ఆకులలము లెమా కమృతాన్నరసములు
తామసదుష్పదార్థంబు లేల ।

లవు— వల్కలంబు లెమాకుఁ బట్టుపుట్టంబులు
చలినాగని దుకూలచయము లేల ।

కుశు— భూతిరుద్రాక్షలే భూషణంబులుమాకు
దుఃఖభాజనములు తొడవులేల ।
లవు— బెబ్బులిమాకెప్డు పెద్దగుఱ్ఱంబులు
గడ్డిమేసెడుతురగంబు లేల ।
కుశు— గీ॥ ధరణి దిరుగాడు మాకరదంబులేల? ।
యటవి చరులకు నగరపర్యటనమేల
లవు— పూజ్యమునివృత్తిగ్రాల మీరాజ్యమేల
కలిమిగలదని మీకింతగర్వమేల॥

విభీ—స్వామీ! నీతనయులుచిక్కని మునివృత్తిని గుదిరియున్నారు.

సుగ్రీ—ఇది మహర్షుల పెంపేగద?

రామ—మావి గర్వపు మాటలుకావు. మీయందలి ప్రియమునఁ జెప్పుచున్నాము.

కుశు—మాతలిదండ్రులకు మాయెడఁ బ్రియముండును. పరులగు మీకేల ప్రీతి జనించును.

రామ—పోనిండు, పెద్దలగు వారొక మాట చెప్పినచిన్నవాండ్రు విన వలయుఁగదా

కుశు—పెద్దవారని యధర్మమును బోధించిన యెడలఁ జిన్నవారయిన మాత్రమున విననగునా?

భర—మేమేమి యధర్మమును జెప్పితిమి?

కుశు—సమరమునకుఁ బూనినపుడు మానుమనిచెప్పుట రాజధర్మమా?

లవు—మాతండ్రియేయయిన యెడల నిట్టి యధర్మము బోధించునా? ఇట్టి మాటల విన్న మమ్ము మెచ్చునా?

రామ—బాలకులారా! మీకీధర్మముల నన్నిఁటిని నెవరు నేర్పిరి?

కుశు—మావాల్మీకి తాతయే,

రామ—(ప్రక్కన) విభీషణా! వీరు సౌమ్యవాక్యలకుఁ జిక్కకున్నారు ఏమి చేయవలెను?

విభీ—దేవా! నాకేమియుఁదోచలేదు.

భరతు—కుమారులారా! పెద్దపులులే గుఱ్ఱములుఁ గాఁగల మీ రీ గడ్డి మేసెడు హాయమునేల పట్టినారు?

కుశు—ధీరతకై పట్టినాము.

రాము—దీని మీరు సాధింప నెంచినారా?

లవు—సాధించియే యున్నాము.

రాము—అయిన మాకు దాన మొసఁగుడు కొనిపోయెదము.

లవు—(ప్రక్కన) అన్నా! వీరు మిగుల యుక్తిశాలురు. మమ్ము మోస గింపవచ్చియున్నారు.

కుశు—ఆశ్వమును బీదబాపలవలె దాన మడుగుచున్నారేమి? హాయ మేధ మేల చేయఁబూనితిరి? మీరు క్షత్రియోత్తములరేనా?

లవు—అదియునుగాక యాయశ్వముఖమున వీరసతీ తనూభవుఁడు వీర వరార్చిత పాదాంభోజుఁడని యేమేమియో దంభముల నేల వ్రాసి పంపినారు? ఇంత పిఱికివాండ్రని మేము తలపలేదు. ఓడితిమని చెప్పుఁడు గుఱ్ఱమును వదలెదము.

రాము—ఈమాట నిశ్చయమేనా?

కుశు—(ప్రక్కన) తమ్ముఁడా! ఈ రాజందులకును సిద్ధముగా నున్నట్టు తోఁచుచున్నది—అయ్యా! ఏయుపాయముచేతనైన మీ యశ్వమును లాగికొని పోవఁబ్రయత్నించుచున్నారా? ఆయత్నములు సాగవు. మమ్ము జయించియే మీ హాయమును గొనిపోవఁదగు.

విభీ—అయ్యలారా! బాలురగు మిమ్ము గెలుచుటయెంతపని? ఒకనిమి షముపట్టదు.

లవు—ఏదీ! నిలువుము నల్లగనొక కొండవలెనుండునిన్నుఁజూచి భయ పడువారముకాము ఇదిగో నాయలుగుదెబ్బ చూడుము. (అని బాణము వేయును.)

సుగ్రీ—అయ్యా! చేతినిబట్టికొనఁగ విడిపించుకొనజాలని మీరు యుద్ధ మెట్లు చేసెదరు?

కుశు—ఏమంటివి? పట్టుకొనుటకు చెట్లకొమ్మలుకావు నీకోఁతిబుద్ధి గట్టి

పెట్టుము. నాచేత చాపమేపారుచుండ నీతాతయైన నన్నుసహిం
పంపజాలడు ఇదిగో నను ముట్టరమ్ము (అనిశరమునువిడుచును)

రాము—కుఱ్ఱలారా! అయిన, నామాటవినరా?

కుశు—ముమ్మాటికి వినము.

భరత—కయ్యమే యొనర్చెదరా ?

లవు—అందులకు సందేహమేమి?

గీ॥ పవనహాయముఁబట్టి, హస్తమునఁ గార్ముకంబు ధరియించి, యుద్ధరంగముననిల్చి,
మీసహోదరులం గెల్చి, మేల్మిగఁటిమి
దీటుకొనియుండ, నింక సందేహమేల॥

రాము— ఇదిగో! ధనువు సంధించుచున్నాను. నాదెబ్బల కోర్చెదరా?

లవు—నీదెబ్బలు మాకుఁదగిలిన గదా మేమోర్వవలయు.

రాము—ఒకవేళ మీయొడలగా గాడినయెడల మేమెవ్వడునఁ జూడ
గలము.

కుశు—రాజేంద్ర! ఇంతమెత్తనివాఁడవు సమరమెట్లొనర్పఁగలవు. వీరవ
ర్యుఁ డెత్తైఱఁగునన్నైతివి?

(రాముఁడానందాశ్రులు, గార్చును.)

భరతు—ఓరీ! మీరుతల్లియొద్ద నాడుకొను బాలురు. మాతో మీరు
పోరలేరు.

ఉ॥ కొండలఁ బిండిగొట్టుటకుఁ గోరుదురే యెవరేని యీఘరర్
మెండుగఁ జేవఁగల్గి ధరమించెడు మ్రాకుఁఁద్రుంపనౌనెయో
కొండికలార మీబలముఁకొద్ది యొనర్పఁడు సాహసంబునీ
మొండితనంబు మానఁదగు మోసముగల్గు నెఱుంగుఁడీమదిన్॥

లవు—ఏమి? మాది మొండితనమో, చులుకఁదనమో, యిదిగో తెల్పె
దఁజూడుము. (అనిబాణప్రయోగమొనర్చును)

కుశు—అయ్యో!

ఉ॥ కొండలఁబిండి పిండిగను గొట్టదె వజ్రము చిన్నదైనఁదా
దండిగ నెట్టివృక్షములఁ దార్కొని గొడ్డలికొంచెమైఁడిన్

ఖండన సేయ లేదె? కొఱగాని ప్రగల్భములేలఁ జూడఁగా
భండన హీనులందఱును, బల్కులుముల్కుల గెల్వనేర్తురే॥

రాము—సుగ్రీవా! ఎన్నివిధములఁ జెప్పినను వీరిపట్టుదల వదలకున్నారు. ఏమి చేయవలెను.

సుగ్రీ—ప్రభూ! మాకేమియుఁ దోఁచలేదు

రాము—ఓరీ! ఇదిగో నాయంపఱచే మీచెంపలను ముద్దుఁబెట్టుకొనునట్లు కొట్టెదనుజూడుఁడు.

కుశు—అటులయిన నివిగో మాశరముల మీశరీరములఁ బూజించులాగున వైచెదము, కనుఁగొనుఁడు.

రాము—అయిన నశ్వమును వదలరుకదా?

లవు—ఎన్ని తేపలు చెప్పవలయును, చెవులు వినరావా?

రాము—మీగురువులగు వాల్మీకి మహాత్ములు చెప్పిన యెడల మాతురగమును విడిచిపెట్టెదరా?

కుశు—వారుమీవలె నధర్మము నేల బోధించెదరు? అదియుఁగాక వారిచట లేరు. స్థలాంతరమునకుఁ బోయియున్నారు.

రాము—(స్వ) కనుక నే యింతజరగినది.

విభీ—అటులయిన మీతల్లిగారు చెప్పిన యెడల యుద్ధమును మానుకొనెదరా?

లవు—ఆమె యాచొప్పున నేలచెప్పును. మీకన్న నామెకు క్షత్రధర్మములు బాగుగాఁ దెలియును. అదియునుగాక మాతోఁ బోరునెట్టివారికి నపజయమేయగుఁగాక యని మాకు వరమిచ్చియున్నది.

సుగ్రీవు—(రామునితో) దేవా! ఇఁక వీరినిమనము జయింపజాలము.

భరతు—ఒకవేళ మీతండ్రియేవచ్చి పెద్దవాండ్రతోఁ బోరాడదగము గాదని చెప్పినేని వినెదరో?

లవు—ఆయన యీయడవుల కేలవచ్చును? మాతల్లిని బాఱఁదోలి తాను పట్టణంబున సుఖమున్నాఁడు.

(రాముఁడు వ్యసనపడును.)

కుశు—లవా! ఇదియేనా నీ తెలివి? రాజన్యులారా! మాజనకునిదర్శించు భాగ్యము మాకింకను గలుగలేదు. మీరన్న చందమున నొక సమయమునకు మాతండ్రియే యిటచనుదెంచిన యెడల శౌర్య ధైర్యముల నేర్పుగాని మీవలెఁబిఱికిఁ దనంబును వెలుపుదన ము గలుపునే? ఆమాటలతోనేమి? ఇబ్బంగిరిత్తపల్కులఁ బ్రొద్దుఁ బుచ్చెదరా? మీవింటినేర్పరి తనముం జూపెదరా?

లవు—అన్నా! మనముకొట్టినఁగాని వీరుతారొక్కనునట్లు తోఁపరు.

రాము—మూఢులారా! ఇది యుద్ధావని. మీరాడుకొను ప్రదేశము కాదు. ఇచ్చట నేనేమి సంభవించునో తెలియుదురా॥

సీ॥ చిల్లగట్టెలుకావు శితశిలీ ముఖములు

కుశు— తునుకలైనప్పుడే తోఁచునయ్య!

రాము డాగుడుమూఁత లాటయుఁ గాదు మేఘాస్త్రము,

లవు— అద్దాని వాయువ్య మడచునయ్య॥

భర— బద్దిగుండ్లిట లేవు బాణాగ్ని గోళముల్

కుశు— పేర్చు వారుణము చల్లార్చునయ్య

రాము— ఉయ్యేలాటలు కావె యురగాస్త్రజాలముల్

లవు— గారుడంబునఁ గడికండలయ్య।

భర— గీ॥ ముద్దుసేతలు లేవిటఁ బోటులడరు।

కుశు— వట్టిమాటలే తెలియంగ వచ్చునిపుడు।

రాము— మోసముఘటిల్లు జెప్పెద బుద్ధివినుడు!

లవు— నీకొమాకో యెటింగెదుగాక యిపుడు।

కుశు—తమ్ముడా! ఇఁకమాటలతో పనిలేదు. శరములఁ బోవనిమ్ము.

(అని యందఱిని బాణములచేఁ గొట్టుదురు.)

హను—ఉత్సా॥ మిమ్ము నూపురమున నునిచిమిఁటికెగిరెదన్ జుడీ॥

కుశు— సొమ్మసిల్లినేల బడియసువులఁ బాయ నెంచెదే।

అంగ— క్రమ్మకొనుచు మీపదములఁ గట్టివైతుజేతులన్।

లవు— రమ్ము! కోతి! నీకరములు వ్రయ్యలగుటఁ గాంచవే॥

(అని హనుమంతుని యంగదునిఁ గొట్టుదురు.)

రాము—(స్వ॥) ఔరా! శూరత! ఈ నాప్రియసుతులు నావారినూరక నొప్పించుచున్నారు. వమ్మెఱుఁగమిచే నింతదూరముజరిగె. నేని పుడు తెలిసికొనుట యుద్ధధర్మ మతిక్రమించిన వాడనగుదు. అదియుంగాక వీరు నన్నెఱిగినచోఁ దమ్ముమన్నింప వేడి తమ తల్లిని గ్రహింపుమని ప్రార్థింప కుందురా? నన్నూరక పోవ నిత్తురా? అప్పుడు పుత్రవ్యామోహమునఁ దనభార్యను మరల స్వీకరించెనని సడిరాకుండునా? ఇంక యజ్ఞమును మానుటెట్లు? ఆహూయమానులైన ఋషీశ్వరుల, బంధుమిత్రుల నిండ్లకు బంపి పాపము నవమర్యాద నొడిగట్టుకొందునా? వీరినుండి నాహయమును సాధించుటెట్లు? సామదాన భేదోపాయములఁ జూచితిని; వానికి వీండ్రు చిక్కలేదు. ఇంక దండోపాయ మొకటె నిలిచినది. అయ్యది నా చేతకాదు. ఈసుందరాకారుల నీముద్దు కొడుకులఁ గొట్టజాల. అంతియేకాక నాజీవితేశ్వరికి నింతకుమున్ను గలుగజేసిన దుఃఖమునకుఁదోడుగా నీపుత్రశోక మును ఘటింపజేసినవాడనగుదు. అట్టులయినయెడల నా హృద యేశ్వరి తనశరీరమునఁ బ్రాణములభరించునా? ఇప్పుడే యీ సు మకోమలాంగులతో నీకాంతారంబుల నెంతవంతచే దినంబులఁ గ్రమించుచున్నదో తెలియదు. అకటా! నేనుబాపకర్ముఁడ. ఇపు డేమి చేయుదును. నా కేమియుఁదోఁచకున్నది. అయ్యో! దైవ మా! ఎట్టియిక్కట్టునను జిక్కించి స్రుక్కింపఁ జేయుచున్నావు అ యిన, నాకొక్కయూహతట్టుచున్నది. గుణములయందుఁబుత్రుల కంటెఁ దక్కువైనను దండ్రికిఁ గీర్త్యతిశయమే కాని కొఱంత గాదు. కావున వీరితో యుద్ధమున నోడినను నాకుఁ బరాక్రమ హీనతకాదు. నావాసి యినుమడించును, నామనోహారిణి యిట్టి శూరయుగ్మముఁ గాంచినందులకు నాకుఁ బరమానంద మగు చున్నది. సమర మొనర్చునట్టులే నటించి నాశరముల వీరిపైఁ బుష్ప ప్రాయములుగాఁ బ్రయోగించెదను.

ఓరీ! మూర్ఖులారా! ఇదిగో! సుమవర్షము—కాదు శరవర్ష

మును గురిపించెదఁ జూడుఁడు. తమ్ముఁడా! విభీషణా! ఏమి యటు లూరకున్నారు. ఈమూఢులయెడ దయఁజూప నక్కఱ లేదు. తారసిల్లుఁడు. (అని బాణముల వేయును).

కుశు—ఏమి? మేముమూఢులమా! మూఢులమో, రణప్రౌఢులమో యిదిగో యెఱుఁగుడు. (అని యమ్ముల జిమ్మును.)

లవు—(నారసముల విసరి) అన్నా! నాపైని పువ్వులు రాలుచున్నవి. యెక్కడివి?

కుశు—అవును. నామీఁద సయితము పడుచున్నవి. ఏమి యుండ వచ్చును. ఓహో! తెలిసె. యీరాజేంద్రుఁడుమిక్కిలిచమత్కారముగాఁ గాండములఁ బ్రయోగించు చున్నాఁడు. కొంతవడిని కైకవడి మోసగించి తదనంతరముతీక్ష్ణమును చూపుఁగాఁబోలు. మనము మెలఁకువతోఁ బోరవలెను. ఇంక మసలనేల బాణము సంధించుము. అందఱిపై సమ్మోహనముఁ బ్రయోగింతము.

పం—గీ॥ పరగమాతండ్రి కడు సత్యవంతుఁడేని।
తల్లిజానకి సాధ్వీమతల్లియేని।
మహిని వాల్మీకి కవిపితామహుఁడయేని।
ధాత్రి రామాయణము సచ్చరిత్రమేని।
యడరు నీయస్త్రమున వీరుపడెద రిప్పుడు॥

(అని బాణములు వేయఁగా నందఱు పడుదురు.)

(ప్ర॥ హృష్టి॥ మృత్యుంజ॥ శ్రీవత్సులు.)

హృష్టి—జయ కుశకుమారా!

మృత్యుం—జయ లవకుమారా!

శ్రీవ—ధీరవర్యులారా! బలసంపన్నులగు నీరాజుల క్షణ మాత్రమున జయించితిరే? మీశౌర్య మేమనవలె?

కుశు—అయ్యలారా! మీదయవలననే మాకుఁ బరిపూర్ణ జయము కలిగె. ఇకఁ దిగులులేక పోదమురండు.

లవు—అన్నయ్యా! ఇట్టివానిని గెల్చితిమని మన యంబకుఁ దెల్పుటకై వీరి యాభరణముల నొక్కొక్కటిఁ దీసికొని పోదము.

కుశు—తమ్ముఁడా! అవన్నియు మన కేల? ఈరాజేంద్రుని చేతి యుంగరమును గొనిపోవుదము. అది చంచలమువలె మించుచున్నది.

(అని శ్రీరాముని యంగుళీయకమును గైకొందురు.)

(హనుమంతుఁడు, జాంబవంతుఁడు కదలిలేతురు)

లవు—ఈవానరుఁడు, నీభల్లుకుఁడు నింక మెలఁకువతో నున్నారే. వీరిద్దఱిని బట్టుకొనిపోయి మనతల్లికిం జూపుదము.

కుశు—అట్లనే కానిమ్ము. శ్రీవత్సా! ఉత్తరీయములతో వీరిని గట్టుదమురండు.

శ్రీవ—నాచేతకాదప్పా!

(లవకుశులు హనుమజ్జాంబవంతులఁ బట్టుకొని పోదురు.

అందఱు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.

"శ్రీ రామచంద్రాయనమః"

శ్రీ

# రామకుమారాభ్యుదయము.

## సప్తమాంకము

పర్ణశాల, సీత, అపర్ణ.

అపర్ణ—సీతాదేవి! నీవిట్లుల చింతించుచున్నావు. దైవకృపవలన నీపుత్రులు శత్రువుల జయించివచ్చి నీకు నేత్రోత్సవముఁ గావించెదరు,

సీత—అపర్ణాంబా! నీవు సమాధానపు మాటలు చెప్పుచున్నావు. నాసుతులు పగతుర గెల్చి వచ్చుట యంతటి సులువని యెంచితివే! వచ్చిన శత్రురాజులెవరో, వారి సైన్యమెంతయున్నదో, యెంత బలహీనులైనను నందటిని దాఁక నాతనయులిరువురే యేరీతి యుద్ధమొనర్పఁగలరు? ఏపగిదిని జయమొంది రాగలరమ్మా? నాకేమియో దిగులగుచున్నది.

అప—అమ్మా! నీవట్లుభయపడకుము. మాశ్రీవత్సాదులుకూడ రాలేదు. వారివెంటనే యున్నారు. నీపుత్రులకుఁ బ్రమాదము వాటిల్లియుంచిన నప్పుడేవచ్చి తెల్పియుందురు.

సీత—అపర్ణా! అట్టి సందర్భము పొసఁగినయెడల వాల్మీకులువారుకూడ సమీపమున లేరే! ఏమిగతి?

అపర్ణా—వారు వచ్చెదనని చెప్పిపోయిన దినమిదియే. నీవు వెఱవకుము.

ప్ర॥ కుశలవులు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు.

కుశ—లవ—తల్లీ! ఇదే నమస్కరించుచున్నాము. నీయాశీర్వాచనమహిమచే జయమంది వచ్చితిమి.

సీత—నాయనా! లవా! అన్నా! కుశా! (అని ఆలింగన మొనర్చును.)

హను— } దేవీ! ఇవే వందనముల నర్పించుచున్నాము.
జాంబ— }

హను—సరసిజ వృత్తములు.

౧॥ శ్రీకరశుభగాత్రీ । ప్రాకటసుచరిత్రీ।
లోకవినుతిపాత్రీ । లోకతతిపవిత్రీ।

౨॥ శ్రీరఘుపతినారీ । చారుసుమశరీరే!
ఘోరదురితదూరే । వారినిధిగభీరే॥

౩॥ ఇందు సదృశహాసే । కుందరదనభాసే।
సుందరమణిభూషే । నందితమునియోషే॥

౪॥ భవ్యనియమజాలే । నవ్యశశిసుఫాలే!
కావ్యరసవిలోలే । అవ్యయపదమూలే॥

సీత—హనుమజ్జాంబవంతులారా! మీకు శుభమగుఁగాక! ఎక్కడనుండి వచ్చితిరి? ఎప్పుడు వచ్చితిరి?

(కుశలవులు సిగ్గుపడుదురు.)

హను—తల్లీయుద్ధరంగమునుండి యీసీముద్దుకొమాళ్ళచేఁ గొని రాబడినాము. వీరిదయవలన నీచరణదర్శన భాగ్యము లభించె.

జాంబ—మేము ధన్యులమైతిమి.

సీత—అన్నలారా! నాకొమరులేదియో జన్నపుగుఱ్ఱమును బట్టుకొని యుద్ధానికై వచ్చిన యోధులతోఁ బోరాడఁబోయి యుండిరి. ఆయుద్ధరంగమేనా మీరన్నది?

జాంబ—తల్లీ! యజ్ఞాశ్వమెవ్వరిదియుఁ గాదు. నీప్రాణేశ్వరుఁడును, మాకుఁ బరమదైవమగు శ్రీరామభద్రునిదే. ఆహాయముకొఱకు వచ్చిన సేనానులితరులు కారు. క్రమముగా శత్రుఘ్న, లక్ష్మణ భరత శ్రీరామచంద్రులే. మాయధీశుఁడగు సుగ్రీవుఁడును, రాక్షసాధీశ్వరుఁడగు విభీషణుఁడును సపరివారముగా వచ్చియున్నారు.

(సీత ఆచ్చపడును కుశలవులు భయకంపితులై చూచుచుందురు.)

హను—అమ్మా! కౌసల్యాదేవియే వీరమాతయని యెన్నుకొనియుంటిని. ఆబిరుదము నీ తనయులచే నేడు కోల్పోయె. శ్రీరాఘవేంద్రుని మొదలుకొని సమస్తసైన్యమును గెడపి యీనీపుత్రరత్నము, లీగుణరత్నము, లీవీరరత్నములు హయమును సాధించుకొని వచ్చినారు.

సీత—హానాథా! (అని చతికిలబడును.)

కుశు—తమ్ముడా! ప్రమాదమాయె. మనము తెలియమైతిమి. తల్లికిఁ గోపమువచ్చునేమో! మన్నన వేడికొనవలెను.—అమ్మా! సీతా!

సీత—ఓరీ! తులువలారా! ఎంతపనిచేసితిరి?

కుశు—జననీ! మేము గుర్తింపమైతిమి. మమ్ము క్షమింపనగును. ఈ యుంగరమును జూడుము. మాతండ్రిదియేనా?

సీత—(అంగుళీయకమును గన్నులనద్దుకొని) అయ్యో! పితృహంతకులారా! పాపకర్ములారా! అప్రయోజకులారా! మిమ్మేమందును?

సీ॥ హృదయేశుకరమున నేవేళఁ దళతళ
నొప్పెసలారెడు నుంగరంబె!
యీహనుమంతునితో హత్తినాకొఱ
కుదధిదాఁటిన ముద్దుటుంగరంబె!
నానాథు సేమంబు నాకెఱింగించి
నన్నూఱడించినయట్టి యుంగరంబె!
లంకలో రెండునెలలు నాదుపూజల
నొందుచుండినయట్టి యుంగరంబె!

గీ॥ ఘనసముజ్జ్వలరత్నప్రకాశితంబు
రామశుభనామ ముద్రావిరాజితంబు
పుడమిఱేనికి నిది ప్రియభూషణంబు
నతని నెడఁబాసివచ్చెనే యకట! నేఁడు॥
(అని కన్నీరు నించును.)

కుశ—అమ్మా! నీశరణ మొందుచున్నాము. మమ్ము మన్నించవలె. మాజనకుఁడనియు, మాకినతండ్రులనియు నించుకేనియుఁ దెలిసియుండినఁ జేతధనుస్సుఁ గొనియుందుమా? వారిచరణంబులకుఁ బ్రణమిల్లి యిచ్చుటకిఁ దోడ్కొనివచ్చియుండమా?

లవ—అంబా! నాకేమియో మాకుపేళ్లఁ జెప్పిరి. తెలియమైతిమి. నీ యడుగులాన నిదిసత్యము.

సీత—అయ్యలారా! మిమ్ముల నేలయనవలెను. బాలురగు మిమ్ముఁ బోకిఁ బొమ్మనుచో మీకేదేని యపాయము సంఘటించునను భయముతో నేమేమియో దీవించిపంపిన నన్నే యనుకొనవలెను. నావిధినె దూరవలెను. నాయాశీర్వచనఫలము హానిఁదెచ్చెనే! అకటా! నేనేమిచేసినను విపత్పరంపర నాకే కలుగుచున్నది. అయ్యో! దైవమా! నేనెందుబోదు. ఈపిడుగుల నేలఁగంటిని. వీరికి సాంగధనుర్వేద మప్పుడే యాముదుకఁడగు వాల్మీకి మహర్షి యేలచెప్పెను?

ప్ర॥ వాల్మీకి.

నాయనా! (అని నమస్కరించును.)

వాల్మీకి—దీర్ఘసుమంగలీభవ!

హను } మహర్షిచంద్రులకు నమస్కరించుచున్నాముఁ
జాంబ }

వాల్మీకి—హనుమజ్జాంబవంతులారా! మీకు శుభమగుఁగాక!

కుశ } తాతా! ఇదే వందనమాచరించుచున్నాము!
లవ }

వాల్మీకి—దీర్ఘాయురస్తు! (సీతనుజూచి) తల్లీ! సీతా! నీముఖాంబుజమున వ్యసనమగుపడుచున్న దేల!

**సీత**—మునికులతిలక!

గీ॥ పరఁగ, 'దీర్ఘసుమంగలీభవ' యటంచు
నన్ను దీవించితిపుడే ప్రసన్నబుద్ధి
నాదుమాంగల్యమునకె భంగము ప్రసంగి
యున్న దేమందు నాదగు నుమ్మలికము॥

(అని దుఃఖించును)

వాల్మీకి—రామ! రామ! అదెట్లు! అదెట్లు!

అపర్ణ—నాయనా! శ్రీరామవిభుఁడు హయమేధమొనర్పనెంచి పంపి యుండిన యశ్వము దేశములనంతట సమ్మానింపఁబడివచ్చి మన యాశ్రమ సీమఁ జేరగా నీ ప్రియశిష్యులద్దానిని బంధించినారు. ఆ హయము కొఱకు వచ్చిన సైన్యమును క్రమముగా శత్రుఘ్నాది శ్రీరామమూర్తి పర్యంతము నందఱితో బోరి వారిని బడవైచి తురంగమును సాధించుకొని వచ్చినారు. ఈవార్త విన్నందున జానకీదేవి తద్దయు దుఃఖించుచున్నది,

కుశ— లవ— { గురువర్య! మేము తెలియక కయ్యమొనర్చినాము మాయపరాధమును క్షమింప వేడుకొనుచున్నాము. (అనిపాదములపైఁ బడుదురు)

వాల్మీకి—సెబాస్! కుమారులారా! మీరు రఘునాథుని పుత్రులనియే యనిపించుకొంటిరి. (అని యాలోచన నభినయించి) తల్లీ సీతాదేవి! నీవు దిగులొందకుము. నీనాథునికి నీ మఱఁదులకు నేయపాయము సంభవింపలేదు, వీరు సమ్మోహనముఁ బ్రయోగించి వచ్చినారు. శ్రీరామునికిఁ బ్రాణాపాయము కలుగునా? లోకములు మునుఁగవా? అతని పత్నివగుటవలనఁ బ్రేమాతిశయమున నీవు దిగులొందుట సహజమేకదా? నీవు దీర్ఘసుమంగలివే! నా వాక్కు లనృతంబులు కావు. సింహమునకు సింగపుఁగూనలే

పుట్టియున్నవి. నీవు సంతోషపడనలదా? శీఘ్రమున మన మామూర్తుల కడకుఁ బోదమురండు. కపి భల్లూకవరులారా! రండు.
(నిష్క్రమింతురు)

—* యుద్ధభూమి *—

(శ్రీరామాదులుపడియుందురు.)

ప్ర—సీత, అపర్ణ, కుశలవులు, మత్యుంజయుఁడు, శ్రీవత్సుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు,

సీత—హా! నాథా! (అని రాముని యొద్దగూర్చుండును అపర్ణాదులు ప్రక్కననిలుచుకొని వ్యసనపడుచుందురు.)
నీపుత్రులచేత నోడితివే? అజేయధానుష్కుఁడవగు నీవు పసిబాలురచే నపజయమొందితివే? కాదు—కాదు—నీసుతు లగుట వలన వారిని నీబాణమునుఁదాకించి యుండవు. ఆమూర్ఖులు నిన్నెంతఁగ కొట్టిన దెబ్బల నోర్చుకొని నీవే పడియుండవచ్చును. నీ పునర్దర్శనభాగ్య మీ జన్మమునఁగలదాయనియెంచియుంటిని. అట్టి పుణ్యమిట్టి దురవస్థలో నాకు లభించెనా? హృదయేశా! ఇంతకు మునుపెన్నఁడు నిట్టిస్థితిలో నిన్నుజూచియుండలేదే! అదియు నేఁడు నాకుఁ బ్రాప్తించెనా? అయ్యో! నే నెట్టి పాపరాశిని? పృథివిని దుఃఖాంశము లెన్ని యున్నవో యవి యన్నియు సీత యను మహాపాతకనామమున స్త్రీరూపమెత్తియున్నవా! తల్లీ! వసుమతీ! ఎట్టిప్రళయకాలమున, నెట్టి భూకంపవేళనీ పుణ్యవతి యగు బిడ్డను గంటివి? అకటా! భరతలక్ష్మణశత్రుఘ్నులారా! మీరును జిన్నవాండ్రచేఁ బరాజితులయితిరే! ఎన్నిటికినిగాదు—వారియెడ మీకుంగల యనుకంపాతిశయమే మిమ్మీస్థితికిఁ దెచ్చి యుండుట సత్యము. లేకున్న మిమ్ములఁ దేఱిచూచు శూరోత్తము లిప్పుడమిని గలరా? కపిరాక్షస వరులారా! కటా! మీకు నాతనయులు హానియొనర్చిరే? మీయుపకార పరంపరల కిదియే నా మావలని ప్రత్యుపకా

రము? నావాండ్రందఱకు నీయవివేకులు శన్యంగారకరూపులైనారు. అయ్యో! ఎట్టి దుష్టులఁగాంచితిని! హా! ప్రాణవల్లభా! నన్నొక కారణముననడవులకు బాఱఁద్రోలితివి మీకందఱకు వెలినైతి నయిన నుమీయెల్లరక్షేమములను చింతించుచుంటినే? మీకిట్టిపాటు రాఁ జెల్లునే! అయ్యో! రాకయెటుతప్పును? నాసంబంధమున మీకివ్వ దువునిదుమ పొడమినది. సంగదోష మూరకపోవునా? నాథా! లెమ్ము! ఇదిగో! నీనందనులఁ జూడుము. చేసినతప్పునకై వగచు చున్నారు. వారి యపరాధమును క్షమించుము. అశ్వమేధముఁ జేయఁబూనితివే? ఎట్టివేళ నుపక్రమించితివి? ఇట్టి ఫలమున కేనా?

ప్ర—వాల్మీకి

ఇదిగో! వాల్మీకులువారు వచ్చియున్నారు. వారిని గౌరవింప వలదా! నీవు మునిజన విధేయుఁడవే! మునిమానస హంసుడవే? ముని మందారుఁడవే? (అని వ్యసన పడుచుండును.)

వాల్మీ—సీతాదేవి? ఎందులకట్లు దుఃఖించుచున్నావు? ఇప్పుడేమి ప్రమా దమయినది? అపర్ణాంబా! నీవుకూడ నామెతో నూరకవ్యసన పడుటఁ జెల్లునా? అపనయింప వలదా? ఈవలఁ దీసికొనిరమ్ము.

అపర్ణ—తల్లీ! సీతా! దుఃఖింపకుము. లెమ్ము. ఇటురమ్ము. కుమారు లారా! ఏడ్వకుఁడు. ఇటురండు. (అని మఱుఁగునకుఁ బోవుదురు)

వాల్మీ—మృత్యుంజయా! నాకమండులువుఁ దెమ్ము.

మృత్యు—తాతా! ఇదిగో! (అని యందిచ్చును.)

(వాల్మీకి కమండలూదకమును ప్రోక్షింపగా రామాదులందఱును లేతురు.)

రామ—మహామునీంద్రులువారి చరణారవిందముల కెల్లరము నమ స్కరించు చున్నాము.

వాల్మీ—దాశరథులారా! మీకు మంగళములగుఁ గాక! విభీషణ సుగ్రీ వాదులారా! మీకందఱకు శుభములగు గాక!

(రామునిఁజూచి)

చ॥ జయజయ! రామచంద్ర! బహుసద్గుణసాంద్ర నరేంద్రచంద్రమా।
జయజయ! జానకీరమణ! సంకటవారణ! జన్మతారణా!
జయ!ముని బృందరక్షణ! నిశాచరశిక్షణ! సారసేక్షణా!
జయహితలోక జీవన! ప్రశాంత జనావన! లోకపావనా॥

నీ యర్ధాంగ లక్ష్మియగు సతీతిలకమైన సీతాదేవిని లోకాపవాద నిమిత్తమెడఁబాసితివే లేక యామెను దోషినిగా నమ్మితివే? నీకట్టియనుమానంబు పుట్టియుండదని నామనసున కుందట్టుచున్నది. నీడయుంబోలె నిరంతరము నీసహచారిణియై మెలంగుచుండియు నొక్కరక్కసి ముక్కడి తన యిక్కకెత్తుకొనిపోయిన కారణమున పితిహరౌతుని యందుఁ జొచ్చితన తల పూవు వాడకుండఁ గాపించిన యనితర సాధ్యమగు ప్రమాణమును జనములు నమ్మరైరి కాంబోలు! ఎంత యవివేకులు? ప్రవిమలచేతయగు సీత కాలిగోటికైన నెట్టిమాలిన్య మంటఁదరమా?

చ॥ చెదలనలంబునుందినునె? చీఁకటిసూర్యుని ముంచనెంచునె!
పొదలెడు జాహ్నవీతటియుఁ బుల్లెలచేనపవిత్రమానె? డెబ్బదితడవల్ దపించినను బంగరమిత్తడి రూపమొందునే!
వసలుము సందియంబు రఘువల్లభ! దోషము సీత నంటునే॥

రామ—ఋషి చూడామణీ! మీవాక్కుల మోఘములు. మీపాదములాన సీతాశీలమును గుఱించినాకెట్టి సందేహమును లేదు. జనాపవాదమును గూర్చి నారాజధర్మమును బట్టి పరిత్యజించితిని.

వాల్మీ—రామా! నీధీరత, నీప్రజానురాగము, నీరాజధర్మపద్ధతి వేనోళ్ళఁ బొగడఁదగి యున్నది, సంతోషము. అయిన నిప్పుడు సీతాదేవిని మరల గ్రహింపవా? నీభుజాశ్రయమును బాసి ప్రాణావశిష్టయై యున్నది. మిక్కిలి స్రుక్కుచున్నది.

రాము—మహానుభావా! నీయాజ్ఞానుసారముగా నాహృదయేశ్వరిని గైకొనుటకు నాకేవిధమయిన సంశయము లేదు. నేను మాత్రము తద్వియోగబాధ ననుభవింపకున్నానా? అయిన, లోకమెట్లు

సమాధానపడును. పుత్రవ్యామోహమునఁ దనభార్యను మరల గ్రహించె రాముఁడని ప్రజలనకుందురా? మరల నపకీర్తికిగుఱిఁ గానా?

ప్ర॥ ప్రజలు.

ప్ర—మాసీతమ్మేది? మారామస్వామేఁడీ? దేవరా! దండములు, దండములు

వాల్మీకి—ఎవరుమీరు?

ప్ర— మాది అయోద్దె, అయోద్దె. ఈమారాజు కొడుకులం.

వాల్మీకి—ఇచ్చట కెందులకు వచ్చియున్నారు?

ప్ర—మాయేల్నివాఁడు యెగ్గముసేస్తావుంటే గుఱ్ఱాన్ని యిడిసింటే మాసీతమ్మవారి కొడుకులు దాన్ని బట్టుకొని మారాజులందఱ్నీ పడగొడిపినారని యిని తల్లిని, పిల్లల్ను, మాస్వాముల్ను అందర్నీ సమాదానంసేసి తోల్కొని పోవలెనని వచ్చినాం స్వామీ! నీవేనా వాల్మీకిరుసి. నీతావున వుండంటినే మా అమ్మవారు, ఇదిగో దండములు. దయసేసిపంపిచ్చు. మావూరికి పిల్చుకపోతాం.

వాల్మీకి—మీరేకదా సీతాదేవి నడవికిఁ బంపినది?

ప్ర—అయ్యో! రామ! రామ! ఆపాపం మామెడకేల కట్టుతావు, జడదారిస్వామీ! ఈమాన్నబావుఁడె సప్పిడికాకుండ పంపినాఁడు. మేమెంత బంగపోయినా, యెంతెప్రార్తనజేసినా యిదివరకు దయబుట్టలే. ఇన్ని చమ్మచ్చరాలయినాయి.

వాల్మీకి—ఔను. మీరన్న చెడుమాటకై సీతాదేవి నడవికిఁ బంపెను. లేకున్న నతఁడు పంపియుండునా?

ప్రజ—అయ్యయ్యో! నీపాదాలసాచ్చిగా మేముగాదు, తబుసులయ్యా! ఈ రాజ్యములో యెవ్వరెవ్వరుగాదు. ఎవరోవకరిద్దరుయియేకము లేని పనికిమాలిన నీశప్పనాయాళ్లు గడ్డితినేకూత కూసిండారంట వాళ్లెవరైంది యిదివరకు మాకుతెల్లే. ఆయమ్మకు దోసమంటేనే అగ్గికి సెదలంటినే? అముత్తంయిసమయ్యేనే? అగ్గిలో దుంకి పెరుమాణంసేసిందే? ఆతప్పుడు నాయాళ్లుమాట గట్టిగాపట్టుకొని

బంగారట్టి తల్లిని. తనపెండ్లామనక, యాకటిమంచనక పాలదోలి మాపెరుబు యీతెగువ సేసిండాడు. అంతేగాని ఇంగెవ్వరేవ్వ ను కాదుస్వామీ! ఇంతరాజ్యములో ఆముండకొడుకుల మాటపొ గల్లుకొన్నట్టు అల్లుకపోయిందిగాని దేశమంత సీతమ్మకోసము దుక్క పోతావున్నారు. కన్క నీవన్నా చెప్పుస్వామీ! మాతేనికి.

వాల్మీకి—అయిన సీతాదేవి మీపట్టణమునకు వచ్చుట మీకుసంతో షమేకదా!

ప్రజ—సంతోసమూ! ఏమినిరాబారయ్యా! అట్లు సెప్తావు? ఆతల్లివచ్చే వరకు మేమన్నము నీళ్లుముట్టితే అప్పుడకుగు.

వాల్మీకి—సరే. సంతోషము. మీప్రభువును వేడుకొనుఁడు. అతఁడు మీదేవేరినిఁ బిలిపింపఁగలఁడు.

ప్రజ—ఏమి? దేవరా! రామప్పెబూ! ఇవిగో దండములు, దండములు. మాసీతాదేవమ్మను బిలిపిచ్చు. నీకొడుకులం. అవేకంముండ కొడుకులం. మాకు బుద్ధిలేదు గ్యానములేదు. ఒకఁడుసేసిన న్యారం అందరికి సుట్టుకోని యీగతిఆయె. మమ్ములమన్నించుకో రాజంటే నీవే రాజు. యినఁడేగాని నీపేరుజెప్పి రాజ్యమేలల్ల నియట్టిదొర యింగ పుట్టుతాడా యీభూమిలో. మమ్ములదయ సూడు. మామనివి యిను. ఇక్కడికియినక పోతేనీసి త్తేము. మే మంతా వూర్లో వకపిల్లలేకుండా యీాన్నే మాతల్లి తావున వుంటాము. ఆపొద్దే సెప్పినాము. మీవూరు మీరేయేలుకొండి. మీయిట్టం.

విభీ—సుగ్రీవా! ఈప్రజలభక్తి నేమనవలె? ఎంతదీనులై వేడుచున్నారో చూడుము.

సుగ్రీ—రాక్షసేంద్ర! కరుణాఘనుడగు రాజుయొక్క ప్రజాకోటివరత్నమే కదా యిది! కొన్నిదినములు సేవించిన మనమే యీ కరుణా మూర్తుల విడిచిపోఁజాలకున్నతిమి. అనవరతసేవాభాగ్య మబ్బిన యీపౌరులు వీరల విడచియుండనోపుదురా?

వాల్మీకి—రఘునాథా! నిజప్రజాపరిత్రాణ పరాయణ! నీవిఁక సంకోచింపవలదు. నీప్రజలేనిన్ను బ్రతిమాలుచున్నారు. నీరాజనీతికెట్టి హానియురాదు. అపవాదము గలుగఁబోదు. జనములందఱు యథార్థముగా నీ సాహసమునకై దుఃఖించుచున్నారు. రాజవగు నీయందును, రాణియగు జానకియందును వారిభక్తిప్రియము లగ్గములుగానున్నవి ఒకమూల నుత్పన్నమైన ధూమము గేహమంతయు వ్యాపించుకరణి నాయపనింద యెల్లెడల శ్రుతమై యుండవచ్చును. రాజపదవికి నీవేతగుదువు. రాణియనఁబడుటకు సీతయేచెల్లును. మీప్రజాసత్ప్రవర్తనమునకై వారి సంతుష్టికై మీరుభయులు పడినకష్టము లాచంద్రార్కము మీకీర్తిలత కవ్యయాంకురములై, మీశాంతసముద్రముల కభంగతరంగములై, మీవివేకపుష్పంబుల కక్షయసౌరభ్యములై వెలయుచున్నవి.

రాము—సంయమీంద్ర! మీవచనములమృతతుల్యములు. మీయానతి మేరకు సీతనుబరిగ్రహించుచున్నాను దయచేసిపిలిపింపుఁడు.

వాల్మీకి—ఇదిగో! ఇచ్చటనేయున్నది. అమ్మా! సీతా! అపర్ణాంబా! పిలుచుకొనిరమ్ము.

(అపర్ణ, సీత, కుశలవులు ముందరికి వత్తురు)

ప్రజలు—ఇదిగో! మాయమ్మ! తల్లీ! జోతలు! జోతలు!

భరత—ఆహా! నేఁడు మా పుణ్యమేమనవలె! అమ్మా! మైథిలీదేవీ! ఇదే నమస్కరించుచున్నాము. (అని భరతాదులందఱు నమస్కరింతురు.)

సీత—దేవా! పవిత్రసూర్యవంశాబ్ధిసుధాకరా! నీదగు యశఃకళాబృందమునకుఁ గళంకీభూతమగు నీపాపచరిత్రి నిపావనచరణమునంట వెఱచుచు నిదే దూరమునుండి ప్రణమిల్లుచున్నది.

రాము—అకటా! సీతా! నీకుమారుల చుఱుకుటలుగులకన్న నెక్కువగా నీపలుకుల నొప్పించితివి. నావియోగబాధాగ్నిని నీవాగాజ్యధారచే మఱింత ప్రజ్జ్వలింపఁజేసితివి. నిజముగా నీకు నామోము చూపఁజాల.

వాల్మీకి—కుశలవులారా! మీనాయనగారికి నభివాదన మొనర్పుఁడు.

కుశ-లవు—తండ్రులారా! ఇదే నమస్కరించుచున్నాము.

(రాముఁడు వారిశిరముల మూర్కొని ముద్దుపెట్టుకొనును. భరతలక్ష్మణులు వారినిఁ గౌగిలింతురు.)

ప్రజలు—బళీ! యీల్లేనా మాప్రెబువు బుడుతలు. ఏమినచ్చుత్రాల వాల్నే వుండార్రా!

ప్రజ— అంతేనామామా! వజ్రాయుదాలువాలె యిపుడు యిద్ధము సేసిండారు.

రాము—(సీతనుజూచి)

సీ॥ లోకాపవాదంబు నాకర్ణములఁబడి
చేకూరెఁ శోకంబు శ్రీకరాంగి!
నాజను లవినీతితోఁ జరింతురటంచు
యోజించితిని గజరాజయాన!
యద్ధానపాపముల్ దగ్ధ యుఁబ్రబలుట
బుద్ధినూహించితి ముద్దుగుమ్మ!
యాపాపములను నాభూపాలతఁడలంచి
సైపనైతి మంజీకలాపరుచిర!
గీ॥ యిట్టు లపకీర్తి నన్ను దా ముట్టకుండ।
నాప్రజలు నీతిమార్గంబునం జెలంగ।
నిన్నుఁ బాసితిఁగాని యొండేమిలేదు।
శ్రీసమేత! వినిర్మలచేత! సీత॥

వాల్మీకి— సత్యము.

సీత—మనోనాథా! మీరాజధర్మమునకు హానికలుగునని వెఱచినన్ను దృణప్రాయముగాఁ బరిత్యజించి మీధర్మమును గాపాడుకొంటిరి. సరియే! నేను సమాధానమడుగలేదే?

విభీ—(సుగ్రీవునిచూచి) కపిరాజా! ఈదేవికి వ్యసనాతిశయమునఁ గోపము పుట్టియున్నది.

సుగ్రీ—ఎట్లుశాంతిపడునో? మనమేమి చేయఁగలముఁ?

రాము—భుజంగ॥

క్షమింపంగ నౌనన్నుఁ గారుణ్యతన్నే ।
రముంజేసి తెంతేని ప్రాణేశ్వరీ ॥

సీత— నే! రమే లేదు మీయందుఁ బ్రార్థింపఁగాఁగా ।
ర్యమేమున్న దేనెంత ప్రాణేశ! మీకుఁ ॥

రాము— అరణ్యంబునం ద్రోసి యా యాసముఁ వం ।
దురంజేసితే మందు దుష్టాత్ముఁడఁ ॥

సీత— హా! పురే మీరు నేవేళపుణ్యాత్ములే, పా ।
పరాశిఁ, విధింగుడ్వఁ బాల్తైతినే నే ॥

రాము— అహో! నొచ్చు లాకింకనాడంగనేలా ।
మహాక్రూరుఁడన్నన్ను మన్నింపుసీతా ॥

సీత— మహారాజరాజేంద్ర! మాన్యాల్ గదా మీ ।
రహా! బామలఁ బెద్ద యాచింప నేలా ॥

ప్రజలు—మాతల్లికిఁ గోపము వచ్చినట్టుంది. ఏమిచేసీని ఎన్ని అగ చాట్ల పడిందో యీయుడవిలో?

రాము—సీ॥

కోపమేల? వియోగ తాపమే మెన్నాళ్లు
సైపఁజాలుదు? శుకాలాప!వినవె

సీత—నాకేమికోపంబు? మీకేల తాపంబు
నేకారనొకసతి రాకయున్నె

రామ—వాలునీపల్కు నాశీలంబెఱింగియు
నీలాగు నొప్పించె దేల? సీత

సీత— మీదయచే సుపుత్రోదయంబాయెను
నాదుఋణముతీఱె నాదినంబె

రామ—ఆ॥ వె॥ అకట! యేటిమాట? లతివరో? నీయాన
హరునిసాక్షిగ, మనసారనిన్ను
బాయ లేదు నిజము, పాయఁగా లేదు, ప్ర
సన్నవగుము సుప్రసన్నవగుము ॥

భరత—అమ్మా! సీతాదేవీ! నీవాగ్బాణంబులచే మాయన్నగారిని నొప్పించితివి. అతఁడు దీనుఁడై వేఁడుచున్నాఁడు దయచేసి ప్రసన్నవగుము.

లక్ష్మ—తల్లీ! జానకీదేవీ! నీకుఁగలుగఁ జేసిన దుఃఖాతిశయమునకు నిఁక నెన్నియైన కఠినోక్తులాడవచ్చును. అవన్నియు మాయన్న పడవలసినదే! అయిన నీవు మైత్రిని మనసుదానవగుట చేతను నీమనోవల్లభుని చిత్తవృత్తి మాకన్న నెక్కువ యెఱింగిన దానవగుటచేతను నీవు శాంతించుటొప్పు.

వాల్మీకి—లక్ష్మణకుమారా! నీవు సూటిగాఁ బల్కితివి. ఇది భార్యాభర్తలన్యాయమే.

శత్రు—అమ్మా! వదినె! మాచిన్నన్న నిన్నడవిని డించి యాఘోరవార్త నీకు విన్పించినప్పుడైన నీవు వ్యసనాతిరేకములో నొకపల్లెత్తుమాటమాయన్నయగు రామభద్రునినాడలేదఁట. కావుననీవిపుడే మన్నను వినుటకు మాకానందముగా నున్నది. నీవును సంతోషాతిశయమునఁ బల్కుచున్నావనియే నా తలంపు.

వాల్మీకి—శత్రుఘ్నా! నీవనినదెంతయు సత్యమే. కుశలవులారా! మీజననిం బ్రార్థింపుడు.

కుశు—శా॥ అమ్మా! సీత! యిదేమి? మాజనకునోనాడంగన్యాయంబైదై
న్యమ్మొప్ప న్నినువేడఁ గైకొనమి మాహా! పాడియే?

లవు— ప్రోలికిన్
మమ్ముందోడ్కొనిపోదునంచు ననవే? మాతండ్రియేవచ్చినా?
డిమ్మాడిక్కఁ గ్రుధనూననేల? కరుణాహారాళతంజూడవే॥

ప్రజ—ఔరా! మాయప్పలు! ఎంతముద్దుగా మాట్లాడుతారు? ఎంత సదివిండారో సూడు.

సీత—నాయనలారా! (అని వారి భుజములపైఁ జేతులుంచి) నా కలుక యెప్పటికిని లేదు. (రామునిఁజూచి) దేవా! నాయెడ నీకుంగల ప్రియము నెఱుఁగనా? నీపిన్నతమ్ముఁడన్నరీతి సమ్మోదాతిశయమునఁ బరిహాసార్థముగా నట్లు భాషించితిగాని నిక్కముగానిను

నొవ్వనాడిన దానఁగాను. ఈగడియవఱకు నీయాజ్ఞఁదలఁదాల్చి నీచరణధ్యానమును జేయుచుంటి, అపనిందకు మాత్రము వగచు చుంటి. అయిన నేనన్నమాటలకు నన్ను క్షమింపుము. అది స్త్రీ స్వభావమని తలంపుము. ఇదే నీచరణాబ్జములకుఁ బ్రణామ మొనర్చుచున్నాను. (అని నమస్కరించును) (రాముఁడు సీతహస్త మునుబట్టుకొని, కుమారులఁ గౌఁగిలించును)

ప్రజ—అమ్మమ్మ! ఇపుడుగదా మాకు కుశాలాయె,

భర—ఉ॥ అద్దిర! నేఁడుగా సుదిన మాగతిఁదాము వియోగబాధల
న్బద్ధయుఁగాలముంగడిపి ప్రేమదలిర్పఁగ గూడిరిప్పు డీ
రిద్దఱిమొద్దికెట్టగనఁగ నీశ్వరు చెయ్దము లేమి చెప్ప నీ
ప్రొద్దునమాకునందఱకు భూరిముదంబొనఁగూడెఁ గంటిరే॥

విభీ॥ పం॥ గీ॥ పలుకనొకపక్షమునఁ దన్నుఁ బాసిచన్న।
పూర్ణచంద్రునిఁ బ్రాకృతి పొందినట్లు।
తమిసిముంచి తలంగిన తరణిఛేప।
కడనెకూడిన తమ్మివాల్గంటికరణి।
విభుని దేవేరికలియుట వేడ్కనించె॥

అందఱు—ఆనందమాయె, ఆనందమాయె.

భర— తల్లీ! రామప్రియా!
సీ॥ దివ్యసౌధంబులఁ దిరుగాడు నీవాకు
టిండ్ల నెగతి వసియించితమ్మ
సరసపదార్థముల్ చవి చూచి తినునీవు
పండ్లచే నేటుతృప్తి పడితివమ్మ।
పట్టుపుట్టంబులఁగట్టుదానవునార
చీరలెవ్విధి నభ్యసించితమ్మ
మెత్తనిపాన్పుల నత్తమిల్లెడునీవు
నేలపై నేటు శయనించితమ్మ

శత్రు—గీ॥ చెల్లియంద్రతో నుద్యానసీమలందు
నెపుడుఁ బ్రొద్దులుపుత్తువు. మృగభయములు

గలిగియున్నట్టి కాన నెక్కరణినీవు।
దివసముల. గ్రమించితిమ్మ, విదేహతనయ॥

సీత—ఆర్యపుత్రులారా! ప్రేముడిమఱందులారా! తొల్లిపదునాలుగేండ్లు వనవాసముల నెట్లుంటి నో యిపుడు నదేరీతి నుంటిని. ఇదినాకు గ్రొత్తగాదు. అపుడును నాకుఁగష్టములు తోఁచలేదు. ఇపుడును నాకలజడికలుగలేదు. ఎట్లన నప్పుడు నాజీవితేశ్వరుని యెండఁబాయక యుండుటచే నాదండకారణ్యము కూడ మఱసాకేతమువలెఁగనిపించుచుండె ఇప్పుడు వనవాసమయ్యు నీయవ్యాజకరుణామూర్తియొక్క (వాల్మీకినిఁచూపి) ప్రేమాతిశయమున నీమునిపత్నుల వాత్సల్యమున మాయిఁథిలానగరమునందున్నట్టు లుంటినిఅదియుంగాక యిచ్చట నానాఘనాజ్ఞ నెరవేర్చిధన్యురాలయితిని ఇదినాకు స్వర్గతుల్యమేకదా' అరణ్యవాస మెట్లగును ?

వాల్మీకి—అమ్మా' సీతా! మేలుమేలుఁ మెచ్చఁదగును.

హనుమ—మహామునీంద్ర! మనమేకాదు. సర్వజగములు మెచ్చఁదగును.

వీరిద్దఱు నిద్దఱే

ద్వి॥ గుణరత్నసముద్రయీకుమారమణిఁడు।
గుణాలతాంతిమనోజ్ఞగుచ్ఛ మీతల్లి।
యవని ధర్మంబుల యవతార మితఁడు!
నవి యిట్టివని తెల్పు నర్థమీతల్లి।
తిలకింప నేకపత్నీవ్రతుం డితఁడు।
విలసిల్లు పతిభక్తి విఖ్యాత యీమె।
ప్రజలను గృపనేలు రాజన్యుఁడితఁడు।
ప్రజల మదులుగొన్న రాణియీతల్లి।
ధరణిలోఁ బూరుషతల్లజుం డితఁడు।
ధరలోన నారీమతల్లి యీతల్లి॥

విభీ—సుగ్రీ—నిజము. నిజము.

సీత—(రాముని దెసఁచూచి) నాథా! యీసీతనూజులునాకంటె నెక్కువగా నిన్ను దర్శించుదినముల గోరుచుండిరి. అకోర్కె నేఁడు

వారికిడేరెను. ఈమహాత్ము చంద్రుని దయచే నన్నివిద్యలఁ జక్క గా నేర్చికొని యున్నారు. అదియుఁగాక నీమహానుభావుఁడు నీ పవిత్రచరిత్రము నద్భుతముగా నతివిస్తారముగా. నతిమనో హరముగా, ఛందోబద్ధముగారచియించియున్నాఁడు. దానిని వీరిచే జదివించు చున్నాఁడు. ఈచదువరులు "అమ్మా! ఈరామా యణ మెవరికథ? ఇందలి శ్రీరాముఁడు మాతండ్రియేనా? సీతవు నీవేనా? యని నన్నడుగుచుండిరి. వారు కావ్యములో నున్న వారు మేమిప్పుడున్న వారమని బదులుచెప్పుచుంటిని. ఈతొందర నాకీదినమునఁ దొలఁగిపోయె. నీవానా డనియుండిన మాటకు నిరు పుటిని కాంచితిని. నీతలం పసత్యమగునా? (కుశలవులను జూచి) అన్నలారా! మీతండ్రిగారిని, మీపినతండ్రి గార్లను, గౌర వార్హులగు నీవిభీషణ సుగ్రీవాదులను యుద్ధసమయమున నేమైన దూఱఁబల్కితిరే!

కుశు—తల్లీ! మేముపోరాడు తఱి వీరినందఱి నననిమాటయుఁ దిట్టని తిట్టును, నాడని హాస్యమును లేదు. తప్పొనర్చినాము.

లవు—అమ్మా! పగతురని యెన్నివిధముల దూషింతురో యన్ని రీతుల వీండ్ర నెల్లరఁ దూలనాడితిమి. తోరంబుగ నేరంబుఁ గావించి నాము.

సీత—అప్రయోజకులారా! అందఱికి నమస్కరించి మన్ననల వేడుఁడు.

కుశు—లవు—

మ॥ అవివేకంబున నిమ్మెఱుంగమిని ఘోరాటంబుఁ గావించి, వే,
యివిధంబుల్ మిముదూఱఁబల్కితిమి,మాయీతప్పు సైరించి, ప్రో
వవలెన్ గూరిమితండ్రులార కరుణాపాంగావలోకంబుచే
నివె కైమోడ్పులఁ గూర్తుమెల్లరకు మేమెంతేని సద్భక్తిమై!
(అని నమస్కరింతురు.)

రాము—

క॥ నాముద్దులన్నలారా!
నామోహన మూర్తులార! నాగతులారా!

నామానికంబులారా!
నామందారంబులార నాసుతులారా॥

(అని యాలింగన మొసర్చును.)

సీతా! వీరి నెన్ని విధములనో పరీక్షించితిని, నామాటలకు జిక్కరైరి. నా గుఱ్ఱమును వదలరైరి. తుదకు నన్నోడించిరి. వీరి కీ ధీరత నీ వాక్చాతుర్యత నెపుడు నేర్పితివి?

(సీతచిఱునవ్వు నవ్వును)

సుగ్రీ—దేవీ! ఇట్టి వారిని నప్రయోజకులని యంటివే! నీవు కన్నతల్లి వగుటచే బుద్ధి గఱవ్రుట కటులంటివి.

మ॥ రవివంశోత్తమము యజ్ఞఘోటకము నిర్లక్ష్యంబు మైబట్టి, వీ
రవరేణ్యుల్ చనుదేర నందఱినిఁ బోరాటంబునం గెల్చిరా
మవిభుం గూడజయించినట్టి సుతులమ్మా! వీరితో బోల్పఁగా
నెవరున్నా రిల నప్రయోజకులు వీరెట్లౌనొకో తల్లిరో॥

విభీ—జగజ్జననీ! నీముద్దుబాలకు లెన్ని చందములనో ముచ్చటగా భాషించుచుండిరి. తన్మధురాలాప సుధా వీచికలఁ దేలియాడుచుంటిమి. వీరి వాగ్భూషణములదే మాకందఱికి శ్రవణాలంకృతి నొనర్చిరి. మే మొకరయినను గోపగించుకొన లేదు.

సీత—మహాశయులారా! మీరెల్లరు నీ కుఱ్ఱల నింత ప్రశంసించుటకు (వాల్మీకినిజూపి) నీ మహాత్మని చేతఁ వారు పెరుగుటయే కారణము.

రాము—ఔను, నిజమే.

మ॥ ఋషిచూడామణీ! యీకొమాళ్ళకు ధనుర్విద్యంబ్రసాదించి, శే
ముషియున్నేర్పి, గుణాలిగూర్చి, నయమున్బోధించి, శాస్త్రార్థ స
ద్విషయంబుల్గడు జొన్పి ప్రోచితిరి, మీ పెంపుర్ బ్రశంసింప మా
నుషమాత్రుండఁ గృతజ్ఞుడన్గడు ఘటింతు న్మత్ప్రణామంబులర్॥

వాల్మీకి—సీతాపతీ! సింహజాతికి పిల్లికూనలు జనించునా? మావులకు వేపకాయలు పుట్టునా? వజ్రాల గనులలో గాజు పూసలు వెలు

వడునా? కల్పవృక్షమునకుఁ దంగెళ్ళు పూచునా? మీరుభయు లుకన్నవారలగుటచే సహజముగా బుద్ధిమంతులే. నన్నేల గొని యాడెదరు?

రాము—తపోధనోత్తమా! సజ్జనుండవగుటచే నీ స్తుతి నొల్లవు. నీయను గ్రహమునకుఁ బాత్రులమైతిమి. మాకు మహాసంతోషమయ్యె. నాఁ పేయసి నీసంరక్షణమందుండి నేఁడు నీవలన సమాగమమైనం దులకుఁ గడుం గడుఁ గృతజ్ఞుఁడను మఱియుఁ ధన్యుఁడ నయితి. యిపుడు నా విన్నపమేమనగాఁ దాము తపయాశ్రమవాసులం దఱితో గోమతీతీరమునకు నే నొనర్పు నశ్వమేధమునకు దయ చేయవలెను. నన్ను గృతార్థుని జేయవలయు.

వాల్మీకి—సంతోషము. అవశ్యముగా వచ్చెదను.

రాము—తమ్ములారా! ఇచట ఋషివర్గములను సపరివారముగాఁ బిలు చుకొని పోదము.

లక్ష్మ—చిత్తము.

రాము—(కుశలవులనుఁజూచి) అన్నలారా! అశ్వ మెచ్చటనున్నది.

కుశు—మనపర్ణశాలయొద్దనున్నది.

లవు—నేను దోలుకొని వచ్చెదను.

రాము—వలదు. హనుమంతుఁడు దానివెంట వచ్చును. మనముపోదము రండు. సీతా! నీవు, నీకొమరులు, ఋషికాంతలు. వారి పుత్రి లు రథమెక్కి రండు. శత్రుఘ్నా! నీవు వీరి యరదము వెంటరమ్ము. సుగ్రీవవిభీషణులారా! మనముకలిసి పోదము

సుగ్రీ—చిత్తము.

రాము—ప్రజలారా! నడువుఁడు, మనపట్టణమునకుఁ బోవుదము.

ప్రజ—బుద్ధిబుద్ధి.

కుశు—మృత్యుంజయా! శ్రీవత్స! మనము రథమెక్కిపోవుదమురండు,

రాము—మహర్షి చంద్రా! సెలవొసంగవలె. (అని నమస్కరింతురు.)

వాల్మీకి—శుభమస్తు. (అందఱు నిష్క్రమింతురు,)

(గోమతీతీరము.)

ప్ర॥ శంభుభట్టు, త్రివిక్రమాచార్యులు, నరసింహాచార్యులు.

శంభు—త్రివిక్రమాచార్యులు? ఏమియజ్ఞమయ్యా! ఏమియజ్ఞమయ్యా? కైలాసపర్వతములు, ద్రోణపర్వతములు, మేరుపర్వతములు వచ్చి నిలిచియున్నవి.

త్రివి—శ్రీరాముఁడొనర్చుయజ్ఞము సరే. పర్వతము లెక్కడవచ్చెనయ్యా! శంభుభట్టు!

శంభు—నరసింహాచార్యులు! ఇతఁడు కనుఁగొనలేదు.—(త్రివిక్రమాచార్యులతో) అన్నపురాసులే కైలాసములు, వడలరాసులే ద్రోణములు, చిత్రాన్నపురాసులే మేరువులు; కనుఁగొనలేదా?

త్రివి—సరియే. సరియే. నీవు తటాకములుకాని సముద్రములుకాని చూడలేదా?

శంభు—ఎక్కడివి?

త్రివి—చూడుము నరసింహాచార్యులు! ఇతడు గుర్తింపలేదు. వెండితొట్లలోనించిన నెయ్యి, పెరుగు, పాలు, చారు, పులుసు, ఇవిచెరువులవలె లేవా?

శంభు—ఔనౌను, ఏమిసేకరించినింపినాడయ్యా! మహారాజు రాముఁడు.

నరసిం—స్వామీ! నేనెన్నిచోట్లనో యజ్ఞములను జూచినాను. ఇట్టి యద్భుతమైనది చూడలేదు. ఎక్కడఁచూచినను జొన్నలరాసులు, రాగులరాసులు, ముగ్గురాళ్ళరాసులు- మహానుభావుడెంత టిత్యాగి, అయ్యా!

త్రివి—ఏమయ్యా! దరిద్రము! జొన్నలు, రాగులు, రాళ్ళు అని మాటలాడుచున్నావు, మనరాజుని నెగతాళిచేసెదవా?

నరసిం—కాదాచార్యులు! బ్రాహ్మణులకు దక్షిణల నిచ్చుటకుగాను బోసియుండిన ముత్తెములఁ, బొగడముల, వజ్రములఁ జూడలేదా మీరు?

శంభు—సెబాస్! సెబాస్! మాకన్నఁజతురముగాఁ జెప్పితివయ్యా! ఏమి దివ్యభోజనము! ఏమిపచ్చళ్లు, ఏమిలడ్డువలు!

త్రివి—చెప్పవలెనా? ఏమిమజ్జిగపులుసులు, ఏమిమండిగలు!

నరసిం—ఇంతియేనా? ఈతళిహారాలు, ఈపులిహోరలు! నేను మఱచి పోనయ్యా!

శంభు—వేలకొలదివంటవాండ్రుచేసినను నాగకున్నది.

త్రివి—లక్షలకొలఁది బ్రాహ్మణులువచ్చినారు, కావున, సాధ్యమగునా?

నరసిం—వారిలో సగముసంఖ్య ఋషులును, వారిశిష్యులే.

శంభు—నిజమే! ఎందఱుఋషులయ్యా! మహర్షులు, బ్రహ్మర్షులు, దేవర్షులు, జడలఋషులు, గడ్డముఋషులు, ఎక్కడఁజూచినను రుద్రాక్షలగలగలలే, కృష్ణాజినముల పడపటలే.

త్రివి—హనుమంతుని బంధువులో?

నరసిం—వారిని గణించుట నక్షత్రగణనమే. యజ్ఞశాలయందు, వంటశాలయందు, భోజనశాలయందు, తాంబూలశాలయందు, సామగ్రిశాలయందు, వృక్షములయందు, నదీతీరమునందు, నదిలోను నెచ్చటఁగాంచిన నచ్చట వానరమయముగా నున్నది. వాండ్రు లేకున్న నీవంటలే జరుగవు. ఎక్కడెక్కడనుండి వట్టి మ్రాకులఁ దెచ్చి పర్వతాకారములుగ వేయుచున్నారు. సామగ్రిల నందిచ్చుచున్నారు. భోజనానంతరము భోజనపాత్రములఁ దీసి యావత్ప్రదేశమును నిమిషమున శుభ్రపఱచు చున్నారు. వారు చేయని పనులే లేవు.

శంభు—ఆచార్యులువారు! భోజనపాత్రము లనగా జ్ఞాపకమునకు వచ్చె. మగవారికి బంగరు పళ్లెరముల మగువలకు వెండితట్టలను బూటబూటకు వేయుచు వారి వారివి కొని పోవచ్చునని యిచ్చుచున్నాఁడే శ్రీరాముఁడు. ఇతని భాగ్యమేమని చెప్పవలెను. ఇతని యౌదార్యము నేమని కొనియాడవలెను.

త్రివిక్ర—తేపటినుండి మన పప్పన్నమును విస్తళ్లను గొనియాడు కొనవలెను.

నరసిం—అయ్యా! సార్వభౌముఁడొనర్చు జన్నము సామాన్యమని యనుకొన్నారా! అదియటుండ నిండు ఈదినమువ బృథస్నానము

కడపటి దక్షిణ, మోయు నన్నివరహాల నిచ్చును. కష్టపడి మోసికొని పోవలెను.

ప్ర॥ ఒక బ్రాహ్మణుఁడు.

ఓ బ్రాహ్మణోత్తములారా! వంటలు సర్వసిద్ధములయినవి శ్రీరాములువా రవభృథస్నానమునకు వెడలుచున్నారు. సమస్త బ్రహ్మసమాజము దయచేసి జాగుసేయక రావలెనని ప్రార్థన.

త్రివి—సంతోషము. మహాస్వామి ఇదేవచ్చితిమి. అంతకంటె మాకేమి పని. అయ్యా! రండుపోదము. (అందఱు నిష్క్రమింతురు).

(యజ్ఞశాల).

రామాదులు, ఋష్యాదులు, తక్కిన వారందఱు,

వాల్మీకి—వశిష్ఠాది మునీంద్రులారా! జనకాది రాజేంద్రులారా! మహాజనులారా! నావిజ్ఞప్తియే మనగా.

వశిష్ఠు—మహానుభావా! నీవాజ్ఞాపనమనఁ దగును గాని నీవిజ్ఞాపనము గొననర్హులమా?

వాల్మీకి—అందఱు సావధానులరై వినవలయు. శ్రీరామచంద్రుఁడు సంకల్పించిన యశ్వమేధము మీ దయవలన నిర్విఘ్నముగాఁ గొనసాగె. సమస్త దేవతాకోటియు, భూతకోటియుఁ దృప్తినందె. శ్రీరఘువీరుని సార్వభౌమ బిరుదము స్థిరీకరింపఁబడియె. ఇతనిచే దీక్షావిసర్జనము చేయించి భార్యాసమేతముగా నవభృథస్నానమాచరింపించి భూదేవశిరోమణుల కవ్వారిగా ధనకనకాది సర్వదానముల నిప్పించి కృతార్థులెతిరి. తద్దయు సంతసమయ్యె.

ఋషులు—సందేహమేమి! సందేహమేమి!

వాల్మీకి—ఏపావన శరీరిణి భూమిగర్భమునఁ బుట్టెనో, యే దివ్యసుందర రూపిణి సుస్వయంవరమునఁ దనకుందగిన పతినిఁ జేపట్టెనో, యేసహధర్మచారిణి తన యొడయ డడవుల నిడుమలఁ గుడువ పోవునెడ నతని యడుగు నెడఁబాయక వెంటనంటెనో, యేశాంతస్వరూపిణి తన్నుఁ జెఱఁగొన్న చెనటిరక్కసుని శపింపక ధవునికిఁ గీర్తిఁగూర్చెనో, యేసుకుమార శరీరిణి పతివియోగ కాలమున

పదిపండ్రెండు నెలలు నిజేశ్వరు చరణధ్యానము నొనర్చుచుఁ జిక్కియుండెనో, యేసాధ్వీశిరోమణి తన నాథుఁడు కోరగా నని తరసాధ్యమగు నగ్ని ప్రమాణముఁ గావించెనో, యేమహారాణి విభుసమేతముగాఁ బట్టాభిషిక్తయై సకలరాజ సమాజ శిరోవిభ్రాజిత కిరీటస్థగిత రత్నరాజ నీరాజితాంఘ్రి పంకేజయై విరాజిల్లెనో, యేపతివ్రతామణి గర్భిణియయ్యుఁ దనపతి యానతి దలఁదాల్చి పెక్కుసంకటముల నోర్చి నెరవేర్చెనో, యేవీరసతీమణి తండ్రిని జయించిన తనయులఁ గాంచి వీరమాతయని భూతలమున ఖ్యాతివహించెనో,

ప్రజలు—మెచ్చవచ్చు! మెచ్చవచ్చు!

వాల్మీకి—అట్టిసీతాదేవి నెవఁడోయొక యల్పుడు వివేకశూన్యుఁడై నిందించెనఁట.

రాజులు—అపరాధము! అపరాధము!

వాల్మీకి—ఆయపవాదమునువిని తనప్రజానురాగమునకు భంగమనియు, దనప్రజ కసంతృప్తికలిగెననియు, నీతిదూరులగుదురనియు, దనరాజధర్మమునకు హానియనియు, దన్నాపాపములుచుట్టుకొనగలవనియు, దనశుభ్రకీర్తిపటమున మసిబొట్టుపడెననియు నెంచి, యీప్రజామనోభిరాము, డీప్రజాక్షేమధాము, డీ నయగుణోద్ధాము, డీ రాజధర్మకళాసోము. డీ ప్రవిమలపుణ్యగుణస్తోము, డీ జగన్నుతకీర్తికాంతాసమాక్రాంత భుజాంతరసీము, డీ జానకీకాముఁడు, తనకష్టమును, దనకాంతకష్టమును బాటింపక యామె నడవిని ద్రోసెను.

సుగ్రీ—దుర్భరము. దుర్భరము.

వాల్మీకి—భూపుత్రియందెట్టి దోషమును లేదు. అపనిందయందెట్టి వివేకలేశమును వైరకారణమును లేదు.

విభీష—సత్యము. సత్యము.

ప్రజ—నిజమేస్వామీ! నిజమేస్వామీ!

వాల్మీకి—ఇదియొక విధిచిత్రము. దానికారణమున వీరికిట్లువియోగము ప్రాప్తింపవలసియుండెను. అదినేటికిదీఱెను. నేనెంతజెప్పినను తుదకు దనజనులే ప్రార్థింపఁగాఁ బ్రాణసతినంగీకరించియున్నాఁడు. ఇట్టి నృపాలతిలకుని మఱియొక్కని మనము తిలకింపఁబోము.

ఋషులు—మేలు మేలు.

వాల్మీకి—ఇఁకనొకమాట. (జనకునిఁజూచి) జనకావనీంద్ర! నీమనుమలను గుఱించియే.

జనకు—భాగ్యము! తమదయవలన నీడాహిత్రుల, నీసుందరగాత్రుల, నీ సుచారిత్రుల, నీ జననీజనక ప్రేమపాత్రుల చూచి సమ్మదమొందితిని.

వాల్మీకి—ఈకుమారరత్నముల జానకీదేవి నాయాశ్రమమునఁ గాంచినది. వీరికి నేన కుశలవులని పేళ్ళనిడినాను. సకలశాస్త్రముల నేర్చియున్నారు. ధనుర్వేదముసహితము నేర్పియున్నాను. వీరును తమగుణవిక్రమముల రాఘవేంద్రుని పుత్రులనియే యనిపించుకొన్నారు. గురువునగు నాకుఁగీర్తిఁదెచ్చిరి.

రాముడు—తమ యమానుషమహిమ.

వాల్మీకి—కాఁగాక. ఈ సీతారాముల పవిత్రచరిత్రమును రామాయణమని పేరిడి శతకోటిప్రవిస్తరముగా నేనురచించియుండునది యీచిన్నవాండ్రు మృదుమధుర స్వరంబుల సరాగతాళమానముల బాడగా విని మీరుసంతోషించితిరి.

ఋషులు—ఆనందమాయె.

వాల్మీకి—నాకును బరమానందమయ్యె. విద్వన్మహాశయులరగు మీరామోదించుటచే నాకవిత్వము సార్థకమాయె. మద్గురువగు నారదభగవానుని చరణకమలములకుఁ గీర్తిఘటించి ధన్యుడనైతి. మీకృపవలన నీచరిత్రము శ్రీరామునివలె నా చంద్రార్కము ఖ్యాతివహించి యుండుఁగాత!

ఋషులు—నిస్సందేహము. నిస్సందేహము.

వాల్మీకి—ఇంక మీ రెల్లరు, కలిసి యీ యిక్ష్వాకుకుల రత్నములకు నీ సీతాసతీరత్నమునకు నీపుత్రరత్నములకు సమస్త మంగళముల నొసఁగుడు.

ఋషులు—అవశ్యము. అవశ్యము.

వసిష్ఠు—ఆర్యులార! నాది యొక మాట.

సీ॥ తనమేనఁ బుట్టపెట్టినను లెక్కిడక ని
 శ్చలతరోగ్రతపంబు సలిపె నెవడు
మహిని శ్రీరామనామమహాత్వమిదియని
 చూపిన గురువతంసుం డెవండు
శతశతకోటివిస్తృతిగ రామబ్రహ్మ
 కథరచించిన యాదికవి యెవండు
రామసతీసుతరత్నంబులఁదమిఁ బో
 షించి పుణ్యము నుపార్జించె నెవడు

గీ॥ చాలకాలముబాసిన యాలుమగలఁ
 గూర్చి కడుఁబున్నియముఁగట్టుకొనియె నెవ్వ
 డట్టి మహితు వాల్మీకిమహర్షి చంద్రు
 బోల్ప నెవ్వాఁడు సాటి యీ పుడమియందు॥

(అందఱు కరతాళ ధ్వనుల నొనర్తురు)

(వాల్మీకినిచూచి) తాపసేంద్రా! ఆదికవీంద్ర! తమగంభీర వాక్సుధా తరంగములలో మామనఃకమలములు తేలియాడెను. శతకోటివిస్తరముగా శ్రీరాముని మహిమను వర్ణించి రచించిన మీ రామాయణమే మీ మాహాత్మ్యమును వర్ణింపఁగలుగును గాని మేము కొనియాడఁజాలము. మీవలె బల్కఁజాలము. మీ యాజ్ఞను సారముగా సీరామాదులకు మంగళమునొనర్చెదము,